# విషయములు



# మా తృ

"నమాతుః పరదైవతమ్"

తల్లికంటె వేఱె దైవతము లేదు అని సంస్కృతనీతివాక్యము. మనజన్మమునకుఁ గారకురా లయిన మాతకంటె, తన కడుపునఁ దొమ్మిదినెలలు మోచి మనలఁ గన్నతల్లికంటె, భూమిమీఁదఁ బడినదిమొదలుకొని బానిసవలెఁ బరిచారము చేయు మాతకంటె, కంటిని ఱెప్ప కాచినట్లు శిశువుల రక్షించు జననికంటె, తనప్రాణ మిచ్చియైనను తనపిల్లల బ్రదికింపఁ బూను తల్లికంటె ప్రేమస్వరూపమగుమాతకంటె వేఱొక దైవ ముండునా? ఎవరిఋణమయినఁ దీర్పవచ్చును గాని తల్లి ఋణము దీర్పశక్యముగాదు. పిల్లలకుఁ దల్లియెడ భక్తి లేక పోవచ్చునుగాని పిల్లలయెడఁ దల్లికి వాత్సల్య ముండకపోదు. ఆవాత్సల్యము ప్రతిఫలాపేక్ష లేనిది. స్వతస్సిద్ధము. మాతతో సమాన మగునది మాతృభూమి. అదియే జన్మభూమి. తాను జన్మించినదేశము. తాను జన్మించినదేశమును తల్లితో సమముగా నెంచవలయును. స్వర్గమయినను జన్మభూమికి సాటి గాదు. కావుననే "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" జననియు జన్మభూమియును స్వర్గముకంటెను గౌరవార్హముల్- అని యార్యులు వచించిరి. మాతృసేవ చేయనివాఁడు మాతృద్రోహి. మాతృద్రోహము చేయువాఁడు మఱేపాపము చేయ

సాహసింపఁడు. అట్టివాఁడుండఁడు. ఉండెనా వాని నిందిం
చిన లాభము లేదు. వాఁడు మాతృసేవ చేయుటలోపము గనఁ
బడకుండఁగ మిగిలినవారే యధికసేవ చేయఁదగును. జననికిఁ
గష్టము వచ్చినపుడు, ఆకష్టములు వాపిన కుమారుఁడే కుమా
రుఁడు. అందఱును జననియందు భక్తియుండును గాని తల్లికిఁ
గలిగిన కష్టములు వాపుటకై తాను కష్టము లనుభవింపవలసి
వచ్చును. కొందఱాకష్టములఁ బడఁజాలక జంకుదురు. కొం
దఱు మహానుభావులు మాతృకష్టములు వాపుటకే కాదు
ఎవరికష్టములు వాపుటకైనను తమప్రాణములు తృణప్రా
యముగా విడిచిపెట్టుదురు. పరోపకారార్థమయి సుఖములు
విడుచుటయే కాదు ప్రాణములు విడుచుటగూడఁ బరమోత్స
వముగా నెంచుమహానుభావులు కొందఱు గలరు. వారు
మాతృకష్టములు వాపినమహానుభావులకంటెఁ బయివారు.
వారిదృష్టిలో జగత్తంతయు నొకకుటుంబము. పరులబాధ
వాపుటకై ప్రాణత్యాగము చేయుటయే జన్మసాఫల్యము.
అట్టిమహానుభావు లేకాలమునను జన్మించుచుందురు. వారి
జన్మము ధన్యము గావించుకొనుచుందురు. పురాణపురుషు
లలో మాతృదాస్యవిమోచనము గావించిన మహానుభావుఁడు
గరుత్మంతుఁడు. పరప్రాణరక్షణార్థమయి ప్రాణము లిచ్చిన
మహాధీరుఁడు జీమూతవాహనుఁడు. అట్టిమహానుభావులకథలు
మరల మరల స్మరించినయెడలఁ గొంచెమయిన మంచిభావము

మనమనమునఁ గలుగక యుండునా? కాలక్షేపమునకై కథ చదివినవారికిఁగూడఁ గొంతసంస్కార మంటకమానదు. దాని మూలమున శౌర్యధైర్యస్థైర్యములు జనించును. అదియేకదా విద్యకు ఫలము.

## కశ్యపుఁడు, పుత్త్రకామేష్టి.

పూర్వము కశ్యపుఁ డను బ్రహ్మ యుండెను. ఆతని కిద్దఱు భార్యలు. కద్రువ ప్రథమభార్య. వినత ద్వితీయ భార్య. ఆతనికి సంతతి లేదు. సంసారవృక్షమునకు మహాఫలము సంతతి. అది లేనివాని సంసారమేకాదు జన్మమును వ్యర్థమే. అట్టిసంతతి పడయువారు పూర్వజన్మమునఁ బుణ్యముచేసిన పుణ్యాత్ములు. పూర్వజన్మమునఁ బాపముచేసినవారి కాభాగ్యము దుర్లభము. సంతాననిరోధము గలిగించుపాపము బోఁగొట్టుకొనుటకై పూర్వము పుత్త్రకామేష్టి చేయుచుండువారు. పుత్త్రులు గలుగవలయు ననుకోరికతోఁ జేయు యాగమే పుత్త్రకామేష్టి. కశ్యపుఁ డాయాగ మాచరింప

సంకల్పించెను. ఆతఁడు విద్యావంతుఁడును తపశ్శాలియు నయి సర్వజనగౌరవమునకుఁ బాత్రుఁడయి యుండెను. వానితపో మహిమకు మెచ్చి వాలఖిల్యాదిమహర్షులును, ఇంద్రాదిదేవతలును వానియాగమునకుఁ దోడ్పడవచ్చిరి. ఇంద్రాదిదేవతలు యాగములయందు హవిర్భాగములు స్వీకరించువారే. అయినను, వారును స్వస్వరూపములతో నితరులవలె వచ్చి యాగాదులకుఁ దోడ్పడుటయుఁ గలదు.

కశ్యపునియాగమున హోమమున కుపయుక్తములగు సమిధలు మహర్షులును దేవతలును తీసికొనివచ్చుచుండిరి. వాలఖిల్యాదులు సహజముగా వామనులు. దానికిఁ దోడనేకోపవాసములుచేసి కృశులయి యుండిరి. దుర్బలులగువారొక్కొక్కసమిధ చేతఁ బట్టుకొని వచ్చుచుండిరి.

ఇంద్రుఁడు స్వతస్సిద్ధముగా మహాదేహుఁడు. బలాఢ్యుఁడు. దానిపైని యాగములందు లంభించు వపలను భక్షించి యాజ్యమును ద్రావి బలిసియున్నవాఁడు. సోమపానమున మత్తుఁడయి రంభాదినాట్యవినోదములతో నిర్విచారముగాఁ గాలము గడపువాఁడు. ఆతఁడు తనబలమునకుఁ దగిన సమిధలమోపు మోచుకొని వచ్చుచు వాలఖిల్యాదులఁ జూచి వారిహ్రస్వాంగతకును వారిదుర్బలతకును వింతపడుచుండెను. అంతలో వాలఖిల్యాదులకు పిల్లకాలువ యొకటి దాఁటవలసి వచ్చెను. వారి కది కుప్తికబంటి యయ్యె. అది మహేంద్రు

నకుఁ బిక్కబంటి యయినఁ గాదు. మహేంద్రుఁడు వారలఁ
జూచి నవ్వి తనతో వచ్చువారికి వాలఖిల్యాదులఁ జూపి వా
రెంతమర్త్యులో చూడుఁడు. అంగుష్ఠపరిమాణు లగు వార
లెందుల కుపయోగింతురు. ఇట్టివారలజన్మమున లోకమున
కేమి లాభముగలుగును ? అని పరిహాసించెను.

ఆమాటలు మునులఁ జెవులఁబడుటచే మునులమనము
లలో నింద్రునిపైఁ గోప ముదయించెను. ఋషు లందఱును
మహేంద్రునిగర్వోక్తులకు సహింపనోపక వానిగర్వ మణఁపఁద
లఁచి యింద్రపదభంగకర మగు యాగమునకు సంకల్పిం
చిరి. తత్ఫలసిద్ధికై తమతపస్సు ధారపోసిరి. ఇంద్రుఁ డామ
నులసంకల్పము విని మనమున భీతినొంది వారలసన్నిధికిఁ బో
యిన వారికిఁ గోపము ద్రేకించునేమో యనుభయమున వారి
సన్నిధికిఁ బోక కశ్యపునిసన్నిధి కరిగి యాతనిని శరణమొం
దెను. శరణాగతరక్షణము సకలజనులకును విహితముగాన
నతఁ డభయ మిచ్చి మహేంద్రునిభయకారణ మడుగ నతఁడు
యథార్థస్థితి వచించెను. కశ్యపుఁడు మహేంద్రునిమాటలను
బట్టి యాతఁడు శరీరబలగర్వమున మొదట మునులను బరిహా
సించె ననియుఁ దర్వాతఁ దనదవి భగ్నమగు నని భయపడి
పశ్చాత్తాపపడుచుండె ననియు గ్రహించి యింద్రునకు శరీరబ
లమునఁ గలిగిన గర్వ మణఁపఁదలఁచి యిట్లనియెను—

మహేంద్రా ! ఒక్కొక్కజాతివారి కొక్కొక్కగుణవి

శేష ముండును. ఆమునులు సత్వగుణప్రధానులు. వారు వేదమందు విశ్వాసము గలవారు. వేదవాక్యములలో నున్నరీతిని దేవతకును నీకును బ్రతిదినమును హావిర్భాగము లీయ మీయనుగ్రహమున వర్షములు కురియుననియు దాననే సస్యాదిసంపత్తి గలుగు ననియు మీ కర్పింపఁగా మిగిలినది యమృత మనియు దానిని భుజించి శరీరము నిలఁబెట్టుకొనుట ధన్యతయేయనియు, మీకర్పింపకుండఁగ భుజించినఁ జౌర్య మగు ననియు నమ్మియున్నవారు. అందుచే పూనముకు సగ ముదినము లుపవసించువారు. వారికి శరీరబల మెట్లు లభించును ? అట్టివారిని బరిహసించుట నీకుమాత్రము భావ్యమా?

వారిలోఁ గొందఱు జ్ఞానసంపన్నులయి యల్పఫలాపేక్షతో దేవతానుగ్రహము సంపాదింపఁ గ్లేశబహుళమగు కర్మము లాచరించినచో నెన్నిజన్మముల కయినను ముక్తి లభింపదని యెంచి తపోనిష్ఠలోఁ బ్రవేశించిరి. వారిదీక్ష యప్రతిహతము. దేవతలు వారితపోమహిమకు భయపడి వారిసన్నిధి కరిగి «వరము లిచ్చెదము కోరుఁ” డని యెదురుబతిమాల వలసినదే. లేకున్న వారితపోగ్నిచే లోకము లన్నియును దపించిపోవును. ఆతపశ్శక్తిని గొంచెము గర్మనిష్ఠతో జోడించి రేని వారిసంకల్పమున కడ్డే లేదు.

వారికిఁ దపోబలబుద్ధిబలములే ప్రధానములు. దేహబలము తుచ్ఛ మని యెంచి దానిని క్షీణింపఁజేయ నెన్నియో

యత్నములు గావింతురు. మాంసమును వృద్ధిపఱచు మాంసా హారము వర్జింతురు. అహింసాధర్మము ప్రధానముగాఁ గొనె దరు. వృక్షలతాదులయందును చైతన్యము గలదని గ్రహించి వానిని నఱకుట కంగీకరింపక వానియాకులును గాయలును భక్షించుచుందురు. కొందఱందునుగొంత హింసగలదని యెంచి పండిపడిపోయిన ఫలపర్ణములే భుజింతురు. కొందఱు జలపానమాత్రజీవులు. కొందఱు వాయుభక్షులు. వాలఖి ల్యాదులు చంద్రకిరణసూర్యకిరణపానమాత్రముననే ప్రాణ ములు నిలఁబెట్టుకొన్నవారు. వారిమాహాత్మ్యము తెలిసికొనుట లేకపోవుటయే కాక వారిని బరిహసించితివా ? చాలుఁజాలు, సాధారణముగాఁ దపస్వులు సులభకోపులు వారియనుగ్ర హము సులభమే. వారిహృదయములు నిష్కల్మషములు, అనుబంధశూన్యములు. తాత్కాలికసందర్భమునుబట్టి దుష్ట కార్యము చేసినవానిపైఁ గోపమొందుదురు. సత్కార్యము చేసినవారిపై ననుగ్రహము చూపుదురు. వారు కోపముగలి నపుడు శపించిరేని యది యమోఘము. వారయినను దానిని మరలింపఁజాలరు. వారినోటవచ్చిన యక్షరములు శిలాక్షర ములే. అపరాధి శరణమొందెనేని మఱియొకరీతి నుపకారము చేయుదురు. కాని ప్రథమసంకల్పము వ్యర్థము చేయరు.

వారలఁ బ్రసన్నులఁ గావింపయత్నించి నీకుఁ బదభ్రం శము కలుగకుండఁ జేసెదను. నేను పిలిచినపుడు వచ్చి

వారిని క్షమింప వేఁడుము " అని చెప్పి కశ్యపుఁడు వాలఖిల్యా దులసన్నిధి కరిగి నాను సంకల్పించిన యాగము చూచి " మహర్షులారా ! మీరీయాగ మేసంకల్పమునఁ జేయుచున్నారో తెలుపఁదగునేని తెలుపుఁ " డన వారిట్లనిరి—

"కశ్యపా! నీకుఁ దెలుపఁదగని దేమున్నది? ఇంద్రుఁడు మాశరీరదౌర్బల్యము చూచి మమ్ముఁ బరిహాసించుట నీకుఁ దెలిసియేయుండును. ఆతఁడు దుర్గర్వి. మున్నొకమాఱు మునులపైకిఁ గుక్కల నుసికొలిపి కొందఱుఋషులను జంపించెను. ఆతని కది యొకయాటయఁట. ఆబ్రహ్మహత్యాదోషము తోనే వానిపని యంతమగుననుకొంటిమి కాని బృహస్పతి కామకృతబ్రహ్మహత్యకుఁగూడ నొక ప్రాయశ్చిత్త మున్నదని ప్రాయశ్చిత్తము చేయించెనఁట. దాన మరలఁ బుఱికొనినాఁడు. ఎట్లయినను, వాని కొకమాఱు గర్వభంగము గావింపవలయును. ఆజ్యవపామాంసభక్షణముననుసోమపానముననుమత్తుఁడయి కన్ను గానకున్నవాఁడు. నీపుత్త్రకామేష్టికి ఫలముగా జన్మించు కుమారులలో నొకఁడు రెండవయింద్రుఁడయి వాని గర్వభంగమును గావించునట్లు సంకల్పించితిమి."

కశ్యపుఁడు—మహర్షులారా! మీరమోఘసంకల్పులు. ఇంద్రుఁడు మిమ్ముఁ బరిహాసించుట తప్పే. ఆతఁడును పశ్చాత్తాపపడుచున్నవాఁడు. మీయెదుటికి వచ్చుటకు భయపడుచున్నవాఁడు. ఆతఁడు క్షంతవ్యుఁ డని తమకుఁ దోఁచెనేని

క్షమింపుఁడు. నామనవి యొకటి చిత్తగింపుఁడు. మున్ను బ్రహ్మ యాతనిని దేవతానాథుని గావించినాఁడు గదా! దాననే యందఱును వానికి హవిర్భాగము లిచ్చుచున్నారు. ఆతఁడు రాజని యెల్లరు నంగీకరించి వ్యవహరించుచున్నారు. మీరు మఱియొక యింద్రుని బయలుదేఱఁదీసితి రేని యాతఁడు రాజునకుఁ బ్రతిరాజగును. దాన లోకవ్యవహారము విపరీతమగును. లోక మరాజక మగును. క్రమముగా ధర్మము నశించును. బ్రహ్మనిర్దేశమునకు వ్యతిరేకమగును. మీమనమునఁ గోపముపసంహరింప వేఁడెదను.

వాలఖిల్యుఁడు—కశ్యపా! మాకు మనమునఁ గోపమున్నదా? వాని దుశ్చేష్టలచే నష్టము చేయఁదలఁచితిమి. మేము సంకల్పించినది మానఁజాలము. నీవు మాఱుఁడు రెండవ యింద్రుఁ డగును. తప్పదు. ఇంద్రుని క్షమింప నవకాశమున్నచో క్షమింప సిద్ధులమే. నీవే యాలోచింపుము.

కశ్య—మహాత్ములారా! మీసంకల్ప మమోఘమే యగుఁగాక. బ్రహ్మనిర్దేశమునకుఁ వ్యతిరేకము గాకుండఁగను, లోకధర్మము విపరీతము గాకుండఁగను, ఒక యుపాయము తోఁచుచున్నది. అదేమంటి రేని నాకుఁ గలుగఁబోవు కుమారుఁడు పక్షీంద్రుఁడగునట్లనుగ్రహింపుఁడు. ఆతఁడు దేవేంద్రుని గర్వభంగము గావించును. దేవేంద్రుఁ డెన్నఁడును తపస్వులజోలికిఁ బోకుండఁగ మీసమక్షముననే మందలిం

చెదను. అతఁడు మీసన్నిధికి వచ్చుటకు భయపడి నన్ను శరణమొందినాఁడు. నే నభయమిచ్చితిని. నా శరణాగత రక్షణాధర్మము నిలఁబెట్టుఁడు.

వాల—కశ్యపా! లోకధర్మము విపరీతమగుట మాకు మాత్రము సమ్మతమా? నీకుమారుఁడు పక్షీంద్రుఁడగుటకు నీ వెట్లుసహింతువు. మే మట్లు లంగీకరించితిమేని నీసంతతి యంతయు నండజమగునే.

కశ్య—మహర్షులారా! లోకధర్మము విపరీతముగాకుండఁగ నిలుపఁగలిగితినేని, బ్రహ్మానిర్దేశమునకు భంగము వాటిల్లకుండఁగఁ జేయఁగలిగితినేని, శరణాగతుని రక్షింపఁగలిగితినేని, నాసంతతి యండజమయినను, నా యానందమునకు భంగము గలిగినను సహింతును.

వాల—కశ్యపా! నీవు మహాధీరుఁడవు. ధర్మరక్షణార్థమయి స్వసుఖపరిత్యాగము గావించినవాఁడవు. పుత్రార్థివయి పుత్రికామేష్టిచేయు నీవే నీసంతతి యండజమగుట కంగీకరించినపుడు సర్వసంగపరిత్యాగము గావించిన మాకుఁ బట్టుదల యేల? ఇంద్రుఁడు మునీశ్వరులయెడల గర్వము చూపకుండఁగ బుద్ధిచెప్పుము.

కశ్య—మీసన్నిధినే వానిని మందలింతును.

అని యింద్రుని బిలిపింప నింద్రుఁడు భయసంభ్రమములతో వచ్చి ఋషులకు నమస్కరించి క్షమింపవేఁడికొని

వారిప్రస్థానమున నుచితాసనమునఁ గూర్చుండెను. అంతఁ గశ్యపమహేంద్రులిట్లు సంభాషించిరి.

కశ్యపుఁడు—"మహేంద్రా! వాలఖిల్యాదు లెంత సదయహృదయులో గ్రహించితివా? వారిహృదయము నిష్కల్మషము. నీ వట్టిపరిహాసము చేయుటచే వారికిఁ గోపము వచ్చినది. రెండవయింద్రుని జనియింపఁజేయ సంకల్పించిరి. అది తప్పదు. కాని నీవు పశ్చాత్తాపపడుట నాముఖమున విని ప్రసన్నచిత్తులయి నీకుఁ బదభంగము గాకుండ ననుగ్రహించిరి. నీ వెన్నఁడును బ్రహ్మవాదులజోలికిఁ బోకుము. బ్రహ్మవాదుల వాగ్వజ్రముముందు నీవజ్ర మంగారప్రాయము. వీరు బుద్ధిబల తపోబలసంపన్నులు. శరీరబలము తుచ్ఛమని నిరసించువారని యిదివఱకఁ జెప్పితినిగదా. మహానుభావుల గుణవిశేషము గ్రహింపక ప్రవర్తించువారిట్లవమానితు లగుదురు. నాకుఁ గలుగఁబోవు కుమారుఁడు రెండవయింద్రుఁడయి నీగర్వభంగము గావించునట్లు వీరు సంకల్పించిరి. నా పుత్త్రుఁడు పక్షీంద్రుఁడగునట్లనుగ్రహింప వేఁడికొంటిని. నీ వాతనితో ద్వేషించితివేని నీకు గర్వభంగమగును. వానితో మైత్రిగావించుకొని సుఖముగ నుండుము. నీపదవికి భంగ మెన్నఁడును రాదు.

మహేంద్రుఁడు—"కశ్యపా! నామూలమున నీకుఁ బక్షిరూపముగల కుమారుఁడు జనించుట కంగీకరించితివా?

నాకుఁ బద్రభంశమయిన నగుఁగాక! నీకుమారుఁడు పక్షిరూపుఁడగుటకు నేను హర్షింతును. నేను చేసిన యపచారమునకు ఫలము నేనే యనుభవింతును."

కశ్యపుఁడు—మహేంద్రా! మాటిమాటయాడకుము. బహుకారణములచే నట్టు నిర్ణయింపఁబడినది. నీవు యథాపూర్వముగా రాజ్యపాలనము చేయుచుండుము. మహర్షుల యాచారవ్యవహారములఁ బరిహసింపకుము.

మహేంద్రుఁడు కశ్యపువచనము మీఱనేరక సవినయముగా వాలఖిల్యాదుల సెలవుపొంది స్వస్థానమున కరిగెను. వాలఖిల్యాదులు వారి తపోనిష్ఠ నవలంబించిరి. కశ్యపుఁడు కద్రువ, వినత యను నిద్దఱుభార్యలతోను పుత్త్రికామేష్టికి సంకల్పము చేసి యాగము పూర్తిగావించెను. యాగమునకు వచ్చిన దేవతలును, ఋషులు, నితరజనులును మహానంద మొందిరి. యాగాంతమునఁ గశ్యపుని జ్యేష్ఠభార్య యగు కద్రువ తనకు వేయిమందికుమారులు గలుగవలయు ననియు వారందఱును సమానవర్చస్కులును, పరభయంకరులును గావలయు ననియు వరముకోరఁ గశ్యపుఁ డావరమనుగ్రహించెను. ద్వితీయభార్యయగు వినత " తన కిద్దఱుకుమారులు గలుగవలయు ననియు, వారిద్దఱును తన సవతికిఁ గల్గు వేయిమంది కుమారులను మించినవారు గావలయు ననియు వరముఁగోరుకొనఁ నతఁ డావర మిచ్చెను.

# కద్రూవినతలసంతతి

అంతఁ గొంతకాలమునకు వారిరువురును గర్భవతు లయిరి. కశ్యపుఁడు భార్యలకుఁగావలసిన ధనధాన్యాదిసంపద లొనగూర్చి తనకాలము వ్యర్థముచేయనొల్లక భార్యలయను మతినే తపముసేయఁ దపోవనమునకుఁ బోవుచు "మీాకం గుడ్లు జనించును. వానిని భద్రముగా రక్షించుకొనుఁడు. మీారుకోరినప్రకారము కుమారు లాయండములనుండి జనిం తురు." అని చెప్పి వెడలెను.

కొంతకాలమునకుఁ గద్రువకు వేయిగుడ్లును వినతకు రెండుగుడ్లును గలిగెను. వారువానిని జాగరూకతతోఁ గాపా డుకొనుచుండిరి. అరీతిసండములు జనించుట కొందఱకు వింత గానుండెను. కాని పుత్త్రికామేష్టికాలమున సంభవించిన సం దర్భమెఱిఁగినవారికది వింతగాఁ గనఁబడలేదు. క్రమముగాఁ గద్రువకుఁ గలిగిన గుడ్లనుండి సర్పాకారులును పరభయం కరులును నగు కుమారులు వేయిమంది పుట్టిరి. వారందఱును సమానపర్వస్కులయి యుండిరి. వారలు పడగలువిప్పియాడు చుండ వారితల్లి యెంతయొసంతసించుచుండెను. వారే నాగ జాతివారు. "వీరిజాతి యభివృద్ధినొందిన లోకములో నిలువఁ గలమా" యనియు "విషముఖులును కుటిలగాములునగు వీరి నెవ్వరయిన నణఁపఁగలరా" యనియుఁ బ్రజలు భయ పడుచుండెడివారు.

ఇంక వినతపెట్టినగుడ్లు పెట్టినట్లే యున్నవి. ఆమెపుత్ర ముఖదర్శనమునకై తహతహపడుచుండెను. తన కింకను పుత్ర దర్శనభాగ్యము పట్టలేదనుదుఃఖము కంటె తనసవతికట్టిభాగ్యము గలిగెననుదుఃఖ మామె కధికమయ్యెను. అదియే యసూయ. అదే చూపోపమి. అది యుండుట తప్పే. కాని యదిలేనివా రరుదు. అసూయచే నవివేక మావహిల్లును. అవివేకమున ననేకవిధముల హాని గలుగును. వినత వివేక శూన్య యయి పుత్రుఁడుదయించుకాలముదాఁక నాఁగక బాలక యొకగుడ్డు వగులఁగొట్టెను. దానినుండి కుమారుఁడొకఁడు బయలుదేరెను. ఆశిశువున కప్పటికి సర్వావయవములు సరిగా నేర్పడలేదు. అందును తొడలలో బలము చేరనేలేదు. అట్టివానిని జూచి వినత విచారింపఁదొడఁగెను. సంతతిఁ బడయుటకు సకాలముదాఁక నిరీక్షింపవలయును. అకాలమున సంతతివడయఁదొందరపడువారికి వికలాంగులో దుర్బలులో యల్పాయుష్కులో జనింతురు. వారిజన్మమువలన వారికిఁగాని వారిజననికిఁగాని తుదకు జన్మభూమికిఁగాని దుఃఖమే కాని సుఖము గలుగనేరదు. అప్పుడు వినత యెంత విచారించిన నేమిలాభము? వాని కూరుబలము లేకుండుటచే అనూరూ! అనూరూ! అని వాపోయెను. దాన నందఱును వాని ననూరుఁడని పిలువఁజొచ్చిరి. అతఁ డనూరుఁ డయినను వానిముఖవర్చస్సు సూర్యతేజస్సువలె వెలుగుచుండుటచే కొందఱాతని కరుణుఁడని పేరుపెట్టిరి.

కొంతకాలమున కనూరుఁడు తనవికలాంగత్వమునకు విచారించి, దానికిఁ గారకురాలు తనతల్లి యని గ్రహించి, మనమున నామెపైఁ గలిగినకోప మణఁచికొని, తల్లియవివేకమునకు విచారించి యిట్లనియె—"తల్లీ! యెంతయవివేకపుఁబని సేసితివి. నాబ్రతు కంతయుఁ గుంటిబ్రతుకయ్యె. నావంటి కుంటికొడుకును జూచిన నీకును శోకము గలుగకతప్పదయ్యె. కాలులేనివాఁడ నెక్కడకుఁ బోదును? ఎట్లు జీవింతును? నాపొట్టయే నేను పోసికొనఁజాలనే నీ కేమి సాహాయ్యము చేయఁగలను."

అను కుమారునిమాటలకుఁ దలవంచికొని తుదకు "కుమారా! దురభిప్రాయముతో నేనట్లు చేయలేదు. పుత్రా! తొందరపడి యట్లు గావించితిని. దానిఫల మనుభవించుచున్నదానను. నన్నుఁ జూచి నలువురు నవ్వుచున్నారు. ఏమి చేయను." అనెడి తల్లి నోదార్చి "తల్లీ! దాఁటిన దానికిఁ జేయునదేమున్నది. రెండవగ్రుడ్డునయిన యుక్తకాలము వఱకుఁ బెరుగనిమ్ము. బలాత్కారముగాఁ బగులఁగొట్టకుము." అన నామె "కుమారా! యింకను నట్టి యవివేకపుఁబని చేయుదునా? కద్రూపుత్రసహస్రమును మించుకుమారులు గలుగుదురని మీతండ్రి నాకు వరమిచ్చెనే? అదియు వ్యర్థమయ్యెనే? ఏమి?" అని ముక్కుమీఁద వేలుపెట్టుకొని యుండెను. "తల్లీ! ఏమి యంతయాశ్చర్యము. ఎవ రిచ్చిన

వరమయినను సకాలముదాఁక నిరీక్షించిన సఫలమే యగును. పురుషయత్నానుసారముగనే దైవయత్నము ఫలించును. గతించినదానికి వగచిన లాభము లేదు. పశ్చాత్తాపము గలిగి నప్పుడు పాడుపని మరలఁ జేయకున్నఁ జాలును. విచారింప కుము ” అని యనూరుఁడు తల్లి నోదార్చెను. సూర్యమండ లాధిష్ఠానదేవత యగు సూర్యుఁడు వినతాకుమారుని తేజస్సును బలమును జూచి మెచ్చుకొని వానిని దనకు సారథిగా నుండఁ గోరి తీసికొనిపోయెను. ఆతఁ డెక్కినబండి దిగుటకు నవకా శము లేదు. దిగిన నడువను లేఁడు. తనయనూరత్వమునకు సరిపోయిన పని లభించిన దని యాతఁడును సంతసించెను.

వికలాంగులు తమస్థితికిఁ దగిన యుద్యమము నవలం బించి జీవింపకున్నచో జన్మమంతయును బరభిక్షామాత్రమున జీవింపవలసివచ్చును: అనూరుఁ డాత్మదేహానుకూల మగు వృత్తి నవలంబించుట యెంతయో యుచితముగ నున్నది. “ నేను కశ్యపబ్రహ్మపుత్రుఁడనే. ఒకనికిబండితోలువాఁడనయి బ్రతుకుదునా ” యని సందేహించినచో వానిబ్రతు కంతయు ‘ బుట్టిబ్రతుకు ’ కావలసినదే గదా.

వికలాంగుఁడయినను తనకొడుకు తనయొద్దనుండుట తల్లి కిష్టముగా నుండును గాని యెడఁబాసి యుండుట యిష్ట ముగా నుండదు. తల్లిదగ్గఱనేకూర్చుండిన దనయుఁడు తనతను వుగడపుకొనుట యెట్లు ? అందుచు పరాధీనజీవనము గడపవ

లసినవాఁ డయ్యెను. తల్లియు నట్లో యంగీకరించి యనూరుని సూర్యసారథిగాఁ బంపి యొంటరిగానుండెను.

కద్రూపుత్త్రులను మించుకుమారద్వయమును వినత వరముగాఁ గోరినదిమొదలు కద్రువకు సవతిపైఁ గోప ముదయించినది. ఆకోపాగ్ని మనమున రాఁజుచునే యున్నది. అంతలో ననూరుఁడు జనించుటయు నాతఁడు తల్లికి దూరమగుటయుఁ జూడఁ గొంత కోపాగ్ని యుపశమిల్లినది. రెండవ యండమున జనించు పుత్త్రుఁడు తనకుమారసహస్రమును మించినవాఁడగునేమో యనుభయముమాత్ర మామెకుఁ గలదు. " భర్త యిచ్చినవరమునుబట్టి యాతఁ డంతవాఁడే యగును. ఆతఁడు జనింపకమునుపే వినత నే కుటిలోపాయముననయిన దాసిగాఁ గావించుకొనినచోఁ దల్లి దాస్యకాలమునఁ బుట్టిన వాఁడు గాన నాతఁడును దాస్యము చేయవలసినవాఁ డగును. పుట్టినదిమొదలు దాస్య మలవడినవానికిఁ బౌరుషమే నశించును. వాని కెంతబలమున్నను వానికి నిరుపయోగమగును. అది దాస్యముననే యుపయుక్తమగును. అప్పుడు నాకుమారులే యున్నతస్థితిలో నుందురు. దానికుమారు లణఁగద్రొక్కి యుంచెదరు. కావున సవతిని దాసిగాఁ జేసికొను నుపాయమాలోచింపఁదగు " నని కద్రువ తదేకదృష్టిగా నవకాశము వెదకుచుండెను. ఆమె యసహాయ యగు సవతికి సహాయురాలుగా నున్నట్లు నటించుచు శయ్యాసనవిహారములయందు

క్షణమాత్రమయిన విడువక వినతతోఁగూడఁ దిరుగుచుండెను. వినతయుసవతిహృదయము కనిపట్టనేరక కలసిమెలసియుండెను.

## దాసము

ఇట్లుండ వారిరువురు నొకనాఁడు సాయంతనవిహారము నకై సముద్రతీరమున కరిగిరి. అక్కడ నుచ్చైశ్రవ మను నింద్రాశ్వము కద్రువకంటఁ బడెను. కద్రువ యాయశ్వమును వినతకుఁ జూపి దానినిక్కుచెవులను, దానిచక్కఁదనమును వర్ణించి నేలకంటియున్న దానితోఁకను జూపి " యంత తెల్లని గుఱ్ఱమునకుఁ దోఁకలో నొకభాగము నల్లగా నున్నదేమి? చూడుచూడు" అన వినత పరిశీలించి చూచి నలుపు కనఁబడకుండుటచే " అక్కా! నలుపెక్కడ నున్నది? వెండితీఁగెలవలె వాలరోమములు వ్రేలాడుచున్నవే." అనఁ గద్రువ " అదేమన్నమాట? నలుపు కనఁబడుట లేదా" యని వాదించెను. వినత నల్లన లేశమయినను లేదని వాదించెను. క్రమముగా వాదములు పంతములలోనికి మాఱినవి. పంతములు

పందెములలోనికి డిగినవి. ఆపందెమున నోడినవారు రెండవ
వారి కాజన్మాంతము దాస్యము చేయుట పణముగా నిర్ణయిం
పఁబడియెను.

కద్రువ తనమనములో నేదో కుటిలోపాయ మంత
లోనే పన్నినది. లేదేని తోఁక తెల్లగాఁ గనఁబడుచున్నను
నల్లగా నున్న దని పందెమేల పలుకును. వినత తనకన్నులకుఁ
దెల్లగాఁ గనఁబడుచుండుటచే నాపందె మొప్పుకొనెను. వా
రిద్దఱును జంటపందెము సలిపి పరిశీలింప నశ్వసమీపము
నకుఁ బోవుచుండఁ గపటాత్మురా లగు కద్రువ "వినతా !
ప్రొద్దు గ్రుంకవచ్చినది. గృహకృత్యము లెన్నియో తీర్పవలసి
యున్నది. సాయంకాలపూజాసమయముగూడ నయినది. రేపు
చూడవచ్చును. ఇంతలో దాఁటిపోవున దేమున్నది? ఇంటికిఁ
బోవుదము రమ్ము" అన నామెయును దొందర యేమి యాను
కొని కద్రువతో గృహమున కరిగెను.

కద్రువ యారాత్రి తనకుమారుల నందఱను బిలిచి
యేదియో చెప్పనుద్యమించియుండ నొకకుమారుఁడు "అమ్మా!
నీముఖవికారము చూడఁగా నీహృదయమున నేదో మహా
విచార మున్నట్లు తోఁచుచున్నది. ని న్నెవరయిన నవమాన
పఱచిరా ? లేదేని నీ కెవరయిన ద్రోహము సేయఁదలఁచిరా?
చెప్పుము. మేము వేయిమందికుమారుల ముండఁగా నీ కంత
విచార మేల ? అని యడిగెను.

కద్రువ—కుమారా! నన్నెవరు నవమానపఱుప లేదు. నాకెవరును ద్రోహముసేయ నెంచలేదు. మీక్షేమమే నాకుఁ గావలసినది. దానికెక్కడ భంగమువచ్చునో యని విచారించుచున్నాను.

కుమా—అమ్మా! మాక్షేమమునకు భంగ మెట్లు వచ్చును.

కద్రువ—కుమారా! మీరు పిల్లలు. రాఁబోవు కష్టములు మీకుఁ దెలిపినచో మీరు భయపడుదు రని యింత దాఁక దాఁచిపెట్టితిని. ఇంక దాఁచిపెట్టుటకు వీలులేదు. జడియకుఁడు. ధైర్యముతో రాఁబోవు కష్టములకుఁ బ్రతిక్రియ చేసికొనుట ధీరలక్షణము. ఆకష్టముల నివారింపఁజేయుటకొక ప్రతిక్రియ యాలోచించితిని. దానిని క్రియారూపమునఁ జూపవలసిన సమయము వచ్చినది. దానివిధానమునకై యింత యాలోచించుచున్నాను.

కుమా—మాకు రానున్నకష్టము లెట్టివి? అవి నీకెట్లు తెలిసినవి.

కద్రువ—అవి క్రొత్తవి కావు. మీరు పుట్టకమునుపే నే నెఱుఁగుదును. మీకు సవతితల్లి యగు వినత మిమ్ము వేయుమందిని మించు కుమారు లిద్దఱు కావలయు నని మీ తండ్రిని వర మడిగినది. ఆయన యావర మిచ్చినాఁడు. దాని మెత్తు ఎంతయెత్తో గ్రహించితిరా? తనకుమారులచేత

మిమ్ము నోడింపఁజేసి వారికాలిక్రింద మిమ్ముఁ ద్రొక్కిపట్టి యుంపఁదలఁచినది. దైవవశమున దాని మొదటికొడుకు వికలాంగుఁ డయినాఁడు. రెండవవానివలన మాకు మహాభయము రానున్నది.

కుమా—అమ్మా! యేమి యంత లేనిపోనిభయము తెచ్చిపెట్టుకొనుచున్నావు. మమ్ము మించిన కుమారులను గోరుటలో దురభిప్రాయ మేమియు నుండదు. అది మాకును సమ్మతమే. తన్ను మించిన తనయుఁడు గలిగిన నెంతసంతోషమో తమ్ము మించిన తమ్ముఁడు గలిగినను సంతసంతోషమే కదా.

కద్రువ—నాయనా! ఎంత వెఱ్ఱినాయనవురా. సవతి తమ్ముల యభివృద్ధి సంతోషకారణ మనుకొనువారు లోకమున నుందురా? మీ రింత యమాయికు లనియే నేను భయపడుచున్నాను.

కుమా—అమ్మా! పిన్నమ్మయు నీవు నెంతయో సఖ్యముతో నుందురే. ఆమె యెన్నఁడును మాయెడల దుర్భావము చూపలేదు. నీ వట్టి యనుమానము పడ నవకాశమేమి?

కద్రువ—దానికిని నాకును సఖ్యమా? ఏనాఁ డట్టి వరము కోరినదో ఆనాఁడే సఖ్యము పోయినది. సమయము కనిపట్టి ప్రతిక్రియ చేయుటకై సఖ్య మున్నట్టు నటించుచు

న్నాను. అదిమాత్రము మనములోనున్న భావము పైకి రానిచ్చునా? గంభీరురాలు. దాని మొదటికొడుకనూరుఁడే కాకపోయినచో నీపాటి కెంతచేసియుండునో మీకేమి తెలియును.

కుమా—అమ్మా! ఇప్పు డెవరివలన భయము?

కద్రువ—పుట్టఁబోవువానివలననే.

కుమా—పెట్టఁబోవు పాఁడు కొనఁబోవు గేదె తిని పోవు నని దెబ్బలాడిన ట్లున్నది. ఎవరయిన విన్న నవ్వరా?

కద్రువ—ఒకరు నవ్వుదు రను సందేహము మన కేల? మనకు రాఁబోవు మహోపద్రవము మనము నివారింపఁజేసికొనవలయును. దూరదృష్టితో నాలోచింపుఁడు.

కుమా—అట్టి యుపద్రవ మేమియు లేదు. నీమాటలనుబట్టి యాలోచించినను దానికిపుడు చేయవలసిన ప్రతీకార మేమున్నది.

కద్రువ—కుమారులారా! అందఱును శ్రద్ధతో వినుఁడు. వినతకు రెండవకుమారుఁడు పుట్టకమునుపే వినతను దాస్యమున నుంచుమార్గము చూడవలయును. దాస్యమున నున్నదానికిఁ బుట్టినవాఁడు గాన నతఁడును దాస్యమున నుండును.

కుమారుఁడు—వినత నీకు సపత్ని. నీతో సమానము

రాలు. ఆమెకు దాసిగా నెట్లు చేసికొనఁగలవు? అదిమాత్ర
ము సామాన్యమా ?

కద్రువ—అది సామాన్యము గాదు. కావుననే యొక
కుటిలోపాయ మాలోచింపవలసివచ్చినది. అది కొనసాగిం
చుట మీచేతిలో నున్నది.

కుమా—అమ్మా! నీవే కుటిలోపాయ మని చెప్పు
చున్నావుగదా. అది యాచరింపఁదగునేని యాచరింపవ
చ్చును. అదేమో సెలవిమ్ము.

కద్రువ—నిన్న మా కొకవాదము వచ్చినది. దాని
పైఁ బందెములలోనికి దిగి యోడినవారు జయించినవారి కాజ
న్మాంతము దాస్యము చేయఁ బణ మేర్పఱచుకొంటిమి.

కుమా—ఆవాదమున నిర్ణేయాంశ మేమి ?

కద్రువ—ఇంద్రాశ్వముతోఁక రోమము తెల్లగానున్న
దని వినత యనియెను. నేను నల్లగా నున్నదంటిని.

కుమా—బాగు! బాగు! అట్లయినచో నీవే యామెకు
దాస్యము చేయవలయునే. ఇంద్రాశ్వవాలమున నెక్కడ
నయిన నలుపుండునా ? నీ కట్లు కనఁబడుట నేత్రదోష
మేమో ?

కద్రు—నేత్రదోషము గాదు, పుత్త్రప్రేమదోషము.
ఆదోషముచేతనే యీకుటిలోపాయముననయినను మీకష్టములఁ

దప్పింపఁజూచుచున్నాను. మీవంటికుమారు లున్నను నాకు సపత్నీదాస్యము చేయవలసిన యోగ మున్నపుడు తప్పునా?

కుమా—జననీ! సూర్యాగ్నులయందుఁ జల్లఁదనము, చంద్రచందనములయందు వేఁడిమి, ఉచ్చైశ్శ్రవావయవము లందు నల్లఁదనము ఎవరయినఁ జూపఁగలరా? మాకుమాత్రము సాధ్యమగునా?

కద్రు—సరియగు యత్నము గావించినచో సాధ్యము గాని పని యుండునా? మీలో నొకరు రే పుచ్చైశ్శ్రవము తోఁక నంటిపట్టుకొని యుండుఁడు. నేనును వినతయు వచ్చి చూచెదము. అనలు పామె చూచెనేని పందెమునఁ బణము గా నేర్పఱచినదాస్యమున కంగీకరించును. సందేహము లేదు. ఆమెచాటునఁ జెప్పుకొనవలెను—సత్యసంధురాలు. మేము చూచి మరలిపోవువఱకును నలుపు గనఁబడినఁ జాలును. అది దాస్యమున కొప్పుకొన్నదన్నమాటే.

కుమా—సత్యసంధత సుగుణ మని మెచ్చుచు దాని మూలముననే యామెకు బాధ గలిగింప యత్నించుట న్యాయ్యమా?

కద్రు—కొందఱి వ్యసనములును, లోపములును శత్రువులతంత్రముల కవకాశ మిచ్చునట్టు సుగుణములుగూడ

శత్రువులతంత్రముల కవకాశ మిచ్చును. రాజ్యతంత్రమున నష్టిపని చేయక తప్పదు.

కుమా.—మోసమున జయమునొందినవారు మొదటఁ గొంచెము వృద్ధిలోనికి వచ్చినను, తుదకు వారికి దురంతము తప్పదు. అని పెద్దలు వచింతురు. ఒకవేళ మనమోసమునకు లోనయి యామె దాస్యమున కంగీకరించినను, ఆమె కుమారుఁడు దాని కంగీకరించుననునమ్మక మెట్లు? అప్పుడుండును మనపాట్లు. అది బాగుగా నాలోచింపుము.

కద్రు.—మీకు లోకానుభవము తక్కువ. పరహృదయస్థితి భావనచే గ్రహింపనచ్చును. దాస్యముచేయువారి సంతతి పుట్టినదిమొదలు దాస్యమున కలవడి యుండును. వారికి దాస్యము హీనకృత్య మని తోఁపదు. దాస్యమే ధనధాన్యసంపత్తికి మూలమనియు దాస్యమే భుక్తిముక్తిసాధనమనియు దాస్యమే యుత్తమోత్తమవృత్తి యనియు నాగర్భదాసులు తలంతురు. దానియందు రోఁతపుట్టినప్పుడుగదా దానియనంగీకారశంక.

కుమా.—తల్లీ! నీవు చేయుభావన విపరీతభావనగా నున్నది. సామాన్యముగా స్వాతంత్ర్యవాంఛ జన్మతస్సిద్ధము. నీవు చెప్పినట్లు దాస్యమలవడినవారికి మొదటఁ గొంతకాలము స్వాతంత్ర్యవాంఛ వ్యక్తము గాకున్నను స్వతంత్రముగా సంచరించు ప్రజలను జూచుటచేనయిన స్ఫురింపకుండునా?

వానిదాస్యస్థితిఁ జూచి జాలిపడు హితులయిన బోధింపకుం దురా? అప్పు డతఁడు తిరుగఁబడునేని మనజాతినంతను సమూలనాశము చేయునేమో.

కద్రు—ఆతఁ డాస్థితికి రాఁజాలఁడు. "కీడెంచి మే లెంచు" మన్నట్లు, ఆస్థితికి వచ్చినను వానితల్లి వినత వాని నణఁచిపెట్టి దాస్యము చేయించును. లేదేని దాస్యమున నున్న దానికిఁ బుట్టినవాఁడవు గాన దాస్యము నీకుఁ దప్పదని నిర్బం ధపెట్టి దాస్యముచేయించుకొనఁగలము. కావుననే యాతఁడు పుట్టకముందే వినతను దాసిగాఁ జేసికొనఁదలఁచితిని. ఇంక వాదప్రతివాదములు చేయవలదు. మీలో నొకరు మహేం ద్రాశ్వవాలము నంటిపట్టి యుండుఁడు.

కుమా—అమ్మా! అట్టిపని చేయ నామనము వాఞ్ఛిం పకున్నది. తల్లి చెప్పినదికదా యని ధర్మవిరుద్ధముగాఁ బ్రవ ర్తింపరాదు. ధర్మవిరుద్ధ మని తోఁచినప్పుడు తల్లిగాదు, దైవ ము చెప్పినను చేయరాదు. ఒకవేళ నాతఁడు మమ్ము మించి యుండిన నుండుఁగాక. నీ కేయుపద్రవమును సంభవింపలేదు గదా.

కద్రు—ఓరి! తెలివిహీనుఁడా! మీకుఁ గలుగు నుప ద్రవము నాకుఁగాదా! మీరు నేను చెప్పినట్లు చేయవలెను.

కుమా—నిర్బంధము చేయకుము.

అంతఁ గద్రువ మిగులఁ గోపమొంది యొకరిద్దఱుదక్క—

మిగిలినవారలనుగూడ విడివిడిగా నడుగ వారును నిరాకరిం చిరి. కద్రువకుఁ బిచ్చికోపము వచ్చి "నిర్భాగ్యులారా! మీరే మమునకై యెంత చెప్పినను వినకుంటిరి. కట్టకట్టినట్లు లందఱును నిరాకరించితిరి. మీ కందఱకును నొక్కసారే పో యేకాలము వచ్చినట్లున్నది. మీవంటి నిర్భాగ్యులు చచ్చిన నేమి? బ్రతికిన నేమి? మీరందఱు శత్రువులబారిఁ బడి చత్తురుగాక" అని తిట్టెను.

అంతలోఁ గర్కోటకుఁ డనువాఁడు "తల్లి తిట్టు తగిలి తీరు నందు రని యెంచి, మాతృవాక్యపరిపాలనముగూడ మహాధర్మమే యని తలంచి తల్లికి మ్రొక్కి "అమ్మా! నీయాజ్ఞ నేను శిరసావహింతును." అన నామె మిగుల సంత సించి వాని నాదరించి "కుమారరత్నమా! నీవే నిజమయిన కుమారుఁడవు ఏదేని వరము కోరుము ఇచ్చెద. ఈనిర్భాగ్యు లందఱును నాకడుపునఁ జెఱుపఁబుట్టిరి." అని పలుక "అమ్మా! నీ వట్టికోపము విడువవేఁడెదను మాలో నెవరు చేసినను అందఱమును చేసినట్లెకదా అందఱను యథాపూర్వ ముగా సమానాదరముతోఁ జూచెద నను వరము నా కిమ్ము. వేఱువరము నా కక్కఱలేదు. అని కోర నామె యంగీకరించి "పిల్లలెంతతప్పు చేసినను తల్లికిఁ గ్రోధ మెందునా? లెండు భోజనమునకుఁ బ్రొద్దుపోయిన"దని యందఱును భోజనశాలకు నేఁగిపోయెను.

మఱునాఁడు ప్రొద్దుటఁ గద్రూవినతలు గలిసి సముద్రతీరమునకు వెడలిరి. ఇంద్రాశ్వము తోఁక యల్లలాడించుచు మేయుచున్నది. అది సహజముగానే తోఁక యాడించుచున్నదో, యేదియో తోఁక కంటుకొనినట్లు తోఁచి తోఁకయాడించుచున్నదో తెలియదు. కద్రువయాజ్ఞాప్రకారము కర్కోటకుఁడు వాల మంటిపెట్టుకొని యున్నవాఁడు. అది వినతకెట్లు కనిపట్టఁగలదు? కద్రువ దానితోఁకలో నున్న నలుపు వినతకుఁ జూపెను. వినత వింతపడె. నిన్న లేని నలుపు నేఁ డెట్లువచ్చె ననుభావమున దనకన్నులను దానే నమ్మక యుండెను. ఎంత పరిశీలించిచూచినను నలుపు ప్రత్యక్షముగాఁ గనఁబడుచుండుటచే మాఱుమాటాడఁజాలక "సవతివాదమే నెగ్గిన"దని యొప్పుకొనెను. కద్రువ తనపన్నాగము ఫలించినందులకు బ్రహ్మానంద మొంది "వినతా! పణము జ్ఞప్తిలో నున్నదా? నీవీక్షణము మొదలు నాకు బానిసవు. నీసర్వస్వము నాయధీనము." అన వినత వినతాస్యయయి దాని కంగీకరించెను.

# దాస్యము

ఆక్షణము మొదలు వినతయవస్థ మాఱిపోయినది. సవతితో సమానముగాఁ గూర్చుండ నధికారము లేదు. కూర్చుండుట కేమి నిలువఁబడుటకయిన నధికారము లేదు. వెనుక నడచినచో "నీకు దారి చూపవలసిన దాసి ననుకొంటివా? అంత వెనుక నుండు వేమి" యని కద్రువ పీడించును. ముందు నడచినయెడలఁ "బ్రభ్వివలె ముందు పోవుచున్నావా" యని దూషించును. సమముగా నడచిన నాతో "సమానురాలవా? నీవు దాసి వన్నమాట మఱచితివా" యని సాధించును. మాఱుమాటాడ వీలు లేదు. దాస్యము చేయువారికి వాక్స్వాతంత్ర్య మెక్కడిది?

కద్రువ యేమి యాజ్ఞాపించునో యని కనుపెట్టుకొని యుండవలయును. ఆజ్ఞాపించునపుడు కద్రువనోటిమాట స్పష్టముగాఁ బలుకదు. సుకుమారతయు బ్రభ్వీత్వగర్వమును బలిసినవి. వినత మాటవినఁబడనియపుడు "ఏమని యంటివమ్మా" అని యడిగినచో విసుగుకొనును. ఉచ్చము, నీచము అనక చెప్పిన దెల్లఁ జేయుచుండవలసినదే. చేసినదానిలో లేనిదోషము లారోపించినను సహించి యుండవలసినదే. సవతిపిల్లలను బుజముపై నెక్కించికొనియుఁ జంకఁ బెట్టికొనియు

నూరిలో వినోదమునకై త్రిప్పుచుండవలసివచ్చె. పిల్లలను మోచుట కొంత యుచితమే. కద్రువనే బుజములపై గుఱ్ఱమెక్కించుకొనిన నెక్కించుకొని త్రిప్పవలసిన యోగ మాసత్యవాడినికిఁ బట్టినది. పాపము! ఆమెయవస్థ తలఁచికొన్న మనకే గుండెబ్రద్దలగుచున్నది. ఆమె కది దుఃఖముగా నుండదా? ఉండును గాని తన కది విధి యనుకొన్నది గానఁ జేయఁగలిగినది. అదిగాక మహాబలసంపన్నుఁ డగు కుమారుఁడు జనించు ననునాసతో జీవనము గడపుచుండెను. ఎంత దురవస్థలో నున్నను ఏదియో యొకయాశ జీవనమును నిలఁబెట్టుకొనివచ్చును. లేకున్నచో, అంతంత దురవస్థలలో నున్నవారు బలాత్కారముగ నయిన మృతిచెందరా? వినత దాస్యదుఃఖ మంతయును తనగ్రుడ్డును జూచికొనఁగానే యంతరించిపోవుచుండెను. ఆగ్రుడ్డునుండి పుత్త్రుఁడు పుట్టి తన్నానందింపఁజేయు నని భావిసుఖము తలఁచికొని కాలము గడపుచుండెను.

# గరుత్మంతుఁడు

ఇట్లుండఁ గొంతకాలమునకు రెండవయండ మవిసెను. అందుండి మహాతేజ మావిర్భవించెను. అది క్రమముగాఁ బక్షిరూప మందినది. పిట్ట కూఁతపట్టినది. ఱెక్కలు వచ్చినవి. ఎగుర నారంభమయ్యె. ఆపెద్దదేహము, ఆఱెక్కలు చూచి ఱెక్కలు వచ్చినకొండ యని యందఱు ననుకొనుచుండిరి. అంత మహాదేహము, దేహమునకుఁ దగినబలము, బలమునకుఁ దగిన తేజము, తేజమునకు దగిన బుద్ధి, బుద్ధికిఁ దగిన యాలోచన, ఆలోచనకుఁ దగిన యుద్యమము, ఉద్యమమునకుఁ దగిన ఫలము. అవిచూచి, ఆకారము పక్షియాకారమయినను మహానుభావుఁడని గ్రహించి యందఱు నానందించుచుండిరి. ఒక్కఱెక్క విసరెనా చుట్టుపట్టుల నున్న పెద్దగుట్టలన్నియు నెగిరిపోవుచుండెడివి. ఆతనిఱెక్కలబలము చూచి యందఱును సార్థకముగా గరుత్మంతుఁడని పేరుపెట్టిరి. అది యాతనితల్లికిని ముద్దుగానే యుండె. ఆతఁడు సర్వవిధముల సాటిలేనివాఁడయి తనవయసునకు మించిన తెలివితేటలతో, విద్యాబుద్ధులతో వినయవిధేయతలతో, బలపరాక్రమములతో సవతితల్లికిని, సవతియన్నలకును గూడ సంతోషము గలిగించుచుండెను. తల్లికిని, తదితరులకు నెంతసంతోషము గలిగించుచుండెనో వేఱెచెప్పవలెనా? కద్రూపుత్రు లందఱును

గరుత్మంతుని యెడ నధిక గౌరవము చూపుచుండిరి. అది చూచి సవతిమాత్రము కద్రువకుఁ గుఱ్ఱవాండ్రపై గుఱ్ఱుమని కోపము వచ్చుచుండెడిది. కుఱ్ఱవాండ్రను చాటునకుఁ బిలిచి కేకలు వేసి కొన్నిదుర్బోధములుచేసి గరుత్మంతుని యెడ నంతయాదరము చూపఁగూడ దని బోధించుచుండెను. తల్లి కఱపిన బోధము లనుసరించి మనము నెంతబిగఁబట్టికొని గంభీరముగా నుండఁదలఁచినను గరుత్మంతుని యెదుటికిఁ బోవునప్పటికి వారి కవశముగా భయభక్తులును నమ్రతయుఁ గలుగకమానవయ్యె. అతనిఁ గొనియాడుట మానిరిగాని యనాదరముమాత్రము చేయఁజాలకుండిరి. క్రమముగాఁ దల్లి చేయుదుర్బోధములు తలకెక్కి యాతనిచేఁ బనులు చేయించుకొనుట ప్రారంభించిరి. పెద్దతల్లి యను భక్తిచేఁ గద్రువ చెప్పిన పనులును, అన్నలు అను నాదరమునఁ గద్రూపుత్త్రులు చెప్పినపనులును నతఁడు చేయుచుండెను. తల్లి వారు చెప్పిన పనులు చేయుచున్నది. తనయుఁడును దాసి కలవాటుపడెను. చిటిక వేయునంతలో కొండ లన్నియుఁ బిండిగొట్టఁగలవానికి వా రెంత పని చెప్పఁగలరు. వారు చెప్పుపని వానికి లక్ష్యమా? వారు చెప్పినపని నిముసములో నెఱవేర్చుట ప్రజ్ఞావిశేష మని యతఁ డెంచుచుండెను గాని వా రేల చెప్పవలెను నే నేల చేయవలె నన్న భావము వానికిఁ గలుగలేదు. అతఁ డది దాస్య మని యెఱుఁగనే యెఱుఁగఁడు. తల్లిమాత్రము తన తనయుఁ డట్టిదాస్యము

చేయుచుండె నని మనమున ఖేద పడుచుండెను. ‘‘బాలునితో నాదుఃఖము చెప్పినచో నేది యెట్లు పరిణమించునో’’యని భయపడుచుండెను. అతఁడు బాలుఁడు. బలవంతుఁడు. కోపము వచ్చి యొక్క దెబ్బతో నాగుల నందఱను జంపినను జంపివే యును. అది కూడనిపని. అని యామె తనయవస్థ వానికిఁ బ్రకటింపదయ్యె. కాద్రవేయులకు గరుత్మంతుఁడు గట్టిబాని సీఁడు దొరకినాఁడు. ఆనాగు లందఱును వానిపై గుఱ్ఱముపై నెక్కిన ట్లెక్కి స్వారిచేయ మొదలుపెట్టిరి. అతఁ డదియు నొకయాటగా భావించి వారిని దేశము లన్నియుఁ ద్రిప్పుకొని వచ్చుచుండెడివాఁడు. గరుత్మంతుని గమనవేగమునఁ గాద్రవే యులకన్నులు తిరుగుచుండెడివి. అతని ఱెక్కయీకల నంటి పట్టికొని ప్రాణములు బిగఁబట్టికొని కూర్చుండెడివారు. ఆరీతిని వారు దేశదేశములు లోకలోకములు వినోదార్థము గరుత్మం తునిపై నెక్కి తిరుగుచుండెడివారు.

ఒకనాఁడు నాగులు గరుత్మంతునిపై నెక్కి పయి కెగు రుమనిరి. అతఁ డొకయుడ్డీనగతితో మేఘమండలము దాఁటి పోయెను. ‘‘ఇంకను బయి కెగురు’’ మని వారు ప్రేరింప నొక్క మెగు రెగుర సూర్యమండలము సమీపమయ్యెను. కద్రూపుత్త్రులు సూర్యకిరణతాపమునకు మలమల మాడి పోయి యవయవములపట్టు వదలి యెండిన కలువకాడలవలెఁ గ్రిందికి దిగజాఱిపడిరి. గరుత్మంతునకు వారు వీఁపుపై నెక్కి

నపుడు బరువనియును తోఁపలేదు. దిగఁజాచినపుడు బరువుదిగి పోయినట్లును తోఁపలేదు. భూమండలము వీడి యెంతదూరము వచ్చితినోయని క్రిందికిఁ జూచి నాగులందఱును గ్రిందికిఁ బడుచుండుట గని క్రిందికి వ్రాలి వారల కుపచారము చేయఁ బూనెను.

వా రెండతాఁకునకే వడగొనిరి. అంతయెత్తునుండి పడుటచే మూర్ఛనొందిరి. వారిప్రాణములు కడయంటెనవి. గరుత్మంతుఁడు ఱెక్కకొంచె మాడించి మెల్లనిగాలి తగులునట్లు చేసెను. వారికిఁ జైతన్యము చేరలేదు. నిస్సత్త్వమగు వారి కళేబరములు అరఁటిచోరుగుచుట్టలవలెనెగురఁజొచ్చెను.

అతఁ డాయత్నము మాని చూచుచున్నంతఁ గద్రువ తనపుత్త్రులస్థితి కర్ణాకర్ణికగా విని మొఱ్ఱోమొఱ్ఱోయని మొఱ పెట్టుచు వచ్చి శోకించి, శోకించిన లాభము లేదనియెంచి వారు సూర్యకిరణతప్తులై పడిపోయినట్లు గరుత్మంతునివలనఁ దెలిసికొని సూర్యకిరణతాపతప్తులకు వర్షోదకమే యమృతమని గ్రహించి మేఘవాహనుఁ డగు నింద్రునిఁ బ్రార్థించిన వర్షము కురియించునని తలఁచి యింద్రు నిట్లు ప్రార్థించెను.

" మహేంద్రా ! మేఘవాహనా ! త్రిలోకాధినాథా! దేవతానాథా! అనాథసంరక్షకా! సూర్యకిరణతాపతప్త మగు జగమునకు వర్షదానమున జీవనము నిలుపుచున్నావు. ఉదకమునకు జీవననామము సార్థకమగునట్లు సూర్యకిరణతాపతప్త

లగు నాపుత్రులను వర్షోదకదానమున రక్షింపుము. మృతప్రాయులగు నాపుత్త్రిలపై వర్షము కురియించి జలపర్యాయమగు నమృతశబ్ద మన్వర్థము చేయుము. దేవతానాథా! దీనురాలను. కరుణించి పుత్త్రిభిక్ష పెట్టుము. రక్షింపు రక్షింపు. నీవె రక్షింపకున్న మాకుదిక్కెవరు మహేంద్రా!" ఆ ప్రార్థనము విని మహేంద్రుఁడు వర్షము కురియింప నవీనవర్షోదక స్పర్శమున నాగులు పునరుజ్జీవితులయి మెదల మొదలిడిరి. కద్రువ మహానందమొంది కుమారులను బలుకరింప వారు నిద్రనుండి మెలఁకువనొంది లేచినట్లు లేచిరి.

తనకుమారునిమూలమునఁ గద్రూపుత్త్రిల కాపద వాటిల్లె నని వినత యంతబాఁక విచారించుచునే యుండెను. ఆమె యదృష్టము బాగుగా నున్నదని యామెయు సంతసించెను.

కద్రువ కొరకొరలాడుచు వినతతో "వినతా! నీకొడు కెంతపని చేసినాఁడో చూచితివా? నాపిల్లలు మహేంద్రానుగ్రహమున మరల బ్రిదికినారుగాని లేకున్న నేమికావలసినది? వానికి బుద్ధిచెప్పెదను. వానికిఁ జీమకుట్టినట్టయిన లేదు చూడు. ధైర్యము—ఎక్కే ధైర్యముగా నది మొండితనము. గంతులువేయుచున్నాఁడు చూడు. ఇటు రమ్మను." అన వినత తనకుమారునిఁ బిలువ నతఁడు యథాపూర్వముగా వారియెదుట నిలఁబడెను.

కద్రువ కోపముతో "ఏమిరా, యింత దుండగము. పిల్లల నంతయెత్తు తీసికొని వెడలి యెక్కడనుండి పడవేసెదవా?" అన గరుత్మంతుఁడు "పెద్దమ్మా! నేనేమి చేసినాను. నేను పడవేసితినా? పెద్దన్నయ్యలు నావీఁపుపై నెక్కి పైకెగురు మనిరి. కొంచెము పైకెగిరితిని. ఇంక నెగురు మనిరి. నేను కొంచెమే యెగిరితిని. అంతలో సూర్యకిరణములతాఁకుడు తగిలినది కాఁబోలు మలమల మాఁడిపోయిరి. నాకా సూర్యకిరణతాపము గోరువెచ్చగనయిన లేదు. అంతదుర్బలులు. అట్టిదుర్బలు లూరకుండక నన్నెగురు మింక నెగురు మనుట యెందులకు? వారికి బుద్ధిసెప్పక నాకా బుద్ధిచెప్ప వచ్చినావు?"అనఁగా, కద్రువ "వాండ్రు కుఱ్ఱవాండ్రు. వాండ్రెగురు మన్నమాత్రమున నీ వెగురవచ్చునా?" అనియెను. గరుత్మంతుఁడు "పెద్దమ్మా! నాకు వా రన్నయ్యలే కదా. నేనే కుఱ్ఱవాఁడను." అనఁ గోపోద్రేకమున "వారు మొదటనుండియు గారాబముగాఁ బెరిగినారు. నీవు దుండగీఁడవు. సేవసేయవలసినవాఁడవు. దాసీపుత్త్రుఁడవు. తారతమ్య మెఱుఁగకుండఁగ నాపుత్త్రులదే తప్పని మొండివాదము చేయుచున్నావా? ఇంకొకమా టట్లనుము. ఏమి చేసెదనో" అని కొరకొరలాడుచు వినతవైపు తిరిగి "వినతా! నీకొడుకునకు బుద్ధిచెప్ప వేమి? దాస్యపురీతి యిదియే యనుకొంటివా? బానిసవన్నమాట మఱచితివా?" అనుచు వెడలిపోయెను.

గరుత్మంతుఁడు—(తల్లివైపు తిరిగి) "అమ్మా! పెద్దమ్మ మాటలు వింతగా నున్నవి. నీవు దాసివా? నేను దాసీపుత్త్రుఁడనా? మనము దాసితనము చేయుచున్నామా? అట్లనుటకుఁ గారణ మేమి? ఎంతమాట వింటిని. నేఁ డెంతదుర్దినము." అని యడిగెను.

వినత—కుమారా! తొందరపడకుము. నేఁడు దుర్దినము గాదు. సుదినమే యనుకొనవలె. కద్రువకొడుకులు మహేంద్రునిధర్మమా యని మరల బ్రదికినారు. లేకున్న మనకెంత నిందవచ్చునో. నాయనా! నేఁడు మనకు గొప్ప సుదినము.

గరు—వాండ్రు బ్రతికిన నేమి? చచ్చిన నేమి? ఇప్పుడుమాత్రము వాండ్ర బ్రదుకు స్థిరమా? వాండ్రతల్లి నన్ను దాసీపుత్త్రుఁడ వన్నందులకుఁ గసిదీఱ నొక్కముక్కుదెబ్బ కొట్టితినా ఆనాగు లందఱును చావవలసినదే? పెద్దమ్మ పెద్దదిగదా యనియు నామెపుత్త్రులు పెద్దవాండ్రుగదా యనియు వాండ్రు చెప్పినపను లన్నియుఁ జేయుచున్నాను. నీవును నట్లే చేయుచున్నా వనుకొనుచున్నాను. ఆమెకుఁ గృతజ్ఞత లేదు సరిగదా, దాస్యము చేయువార మని దండింపఁబోవుచున్నదా? దాస్యము గీస్యము వదలించివేసెదను.

వినత—కుమారా! కోప ముద్రేకింప నీకుము. దానికిఁ గారణము లేకపోలేదు. మే మిరువుర మొక వాదమున

జంటపందెము సలిపితిమి. దానిలో నోడినవారు దాస్యము చేయుట పణము. నే నోడిపోయితిని.

గరు—అమ్మా! వాద మేమి ?

వినత—ఉచ్చైశ్శ్రవముతోఁకలో నలు పున్న దని యామెయు నలుపు లేదని నేనును వాదముచేసితిమి.

గరు—అమ్మా! నీవాదమే సరియయినది. ఆమెయే నీకు దాస్యము చేయవలెనే. వ్యత్యస్త మయిన దేమి ?

వినత—కుమారా! మఱునాఁడు పరిశీలించితిమి. దానితోఁకను నలుపు గనఁబడినది. దాన దాస్యమున కంగీకరించితిని.

గరు—ఏదో మోసము జరిగియుండును. లేకున్న నింద్రాశ్వవాలమునకు నలుపెక్కడిది ? తల్లీ ! యింత కాల మేల దాఁచిపెట్టితివి. చెప్పవైతివేమి ? నీ వన్నట్టు నేఁడు గొప్పసుదినమే. ఇంకను మోసపోకుండఁగ వారిభావము విశదమయినది. ఇంకదాస్యము గీస్యము లేదు. ఇంకను నీండ్రను వీఁపుమీఁద నెక్కించుకొని దేశదేశములు లోకలోకములు తిరుగుదునా ? ఒక్కొక్కదెబ్బతో యమలోకమాత్రకుఁ బంపెదను.

వినత—కుమారా! అట్టిమాట నీనోట రానీకుము. మనము ధర్మము విడువరాదు.

గరు—అమ్మా! అది ధర్మవిరుద్ధము కాదు. ఆవంచకుల కది తగినదే.

వినత—వంచకు లయిననుసరే. నేను దాస్యమున కొప్పుకొంటిని. నాగర్భమునఁ బుట్టుటచే నీకును దాస్యము తప్పినది కాదు.

గరు—మరణపర్యంతము మన మీదాస్యము చేయవలసినదే యందువా?

వినత—వారు విడువకున్నచో నట్టిదే.

గరు—కటకటా! అమ్మా! ఆజన్మాంతమును దాస్యము చేయుటకంటె సాధనాంతరమున జన్మాంతము చేసికొనుట మంచిదేమో.

వినత—కుమారా! బలాత్కారముగా జన్మాంతము గావించుకొంటిమేని జన్మాంతరమున వారిఋణము దీర్పవలసి యుండును.

గరు—ఈపాడుదాస్యము జన్మాంతరమునకుఁగూడఁ దెచ్చిపెట్టకుము. ఇంతదాఁక నెట్లు చేసితినా యనుకొనుచున్నాను. దాస్య మని యెఱిఁగినఁ జేయఁగల్గుదునా? వారు దాస్యముచేయించుకొనుటకు మరగినారు. మనలను స్వేచ్ఛగా బ్రదుకుఁ డని విడిచెదరా.

వినత—విడుచునట్లు గావించుకొనవలయును.

గరు—సరే. ఒక్కటెక్కదెబ్బతో “మీసేవ మాక

క్కఱలేదు. దూరముగా లేచిపొండోయి" అని మనల విడుచు నట్లు గావించెదను. అక్షణములో దాస్య మంతరించిపోవును.

వినత— అది క్రూరమార్గము శాంతమార్గము విడువ నని శపథము చేయుము. క్రౌర్యాభావమే ప్రధానధర్మము. అది లేని స్వాతంత్ర్యముకంటె దాస్యమే యుత్తమము.

గరు— శాంతమార్గము సన్యాసుల కుపయుక్తము. స్వాతంత్ర్యసంపాదనేచ్ఛ గల సంసారులకుఁ గాదు. శాంతి సాధనము పనికివచ్చునా? వంచకులను సాధుమార్గమునకుఁ దీసికొనివచ్చుట దుర్ఘటము. అయోవండమును నిప్పులలోఁ గాల్పకుండ దానివంపులు దీర్పఁగలమా? అట్టినిర్బంధము గలిగించితి వేని యీదాస్యనిర్బంధము మనకుఁ దప్పదు.

వినత— నీవంటి ప్రజ్ఞావంతులకు దుర్ఘటకార్యము లుండునా? నీ ప్రజ్ఞావిశేషమునఁ గాద్రవేయుల మెచ్చించి విముక్తుల రయితిరని వారిచే ననిపించుకొనవలెను. అప్పుడే మనము స్వతంత్రుల మగుదుము.

గరు— అమ్మా! ఆత్మపౌరుషము చంపుకొని వారు మెచ్చుకొని విడుచునంతదాఁక దాస్య మెట్లు చేయఁగలను. స్వాతంత్ర్యము ప్రతిజీవికిని స్వతస్సిద్ధము. పరతంత్రత కారణాంతరములవలన నారోపితము. అది తొలఁగించుకొనవలయును. అదియే విముక్తి. స్వాతంత్ర్యము జన్మతో లబ్ధమే. నీయాజ్ఞ శిరసావహించి శాంతమార్గముననే ప్రవర్తించెదను.

ఏదినమునఁ బరుల వంచకబుద్ధిమార్పఁగలనో యేదినమున వారివలన విముక్తి సంపాదింపఁగలనో ఆదినమే సుదినము. అట్టిదినము నాజన్మమున లభించునా? ఇతరదినములన్నియు దుర్దినములే. శాత్రవులకైన దాస్యము వలదు వలదు.

---

## గోపకుమారన్యాయము

వినత—కుమారా! మీతండ్రి యొకనాఁడు వేదాంతప్రవచనసమయమున నొకకథ చెప్పినాఁడు. నీహృదయస్థితి చూచిన నాకది జ్ఞప్తికి వచ్చినది.

గరు—జవనీ! యేమి యాకథ వినఁదలతు వచింపుము.

వినత—మున్ను కుసుమపురమున రాజశేఖరుఁడను రాజచంద్రుఁ డొకఁడు రాజకార్యనిర్వహణసమర్థు లగు మంత్రుల సాహాయ్యమునఁ బ్రజారంజకముగఁ బాలించుచుండెను. మంత్రులు భోగపరాయణు లయి ధనాశాపరులయి ప్రభు భాండాగారమంతయు నేదియో యొకవ్యయమువంక పెట్టి సర్వశూన్యము గావించిరి. తమకును రాజునకును గావలసిన

ధనము లేక పన్నులు హెచ్చించియు నల్పాపరాధము చేసిన వారికిఁగూడఁ బెద్దదండనములు విధించియు దేశమున నున్న ధనవంతులఁ గొల్లపెట్టియు దాఁచబడి హెచ్చింపఁజొచ్చిరి. దాన రాజునందుఁ బ్రజల కనురాగము చెడెను. ఆసమయము గని పట్టి శత్రురాజులు దేశమందలిప్రజలను వశపఱచుకొనియు దానభేదోపాయములతో రాజభటులను, రాజపురుషులను తమకుఁ లోఁబఱచుకొనియు నాతనిదేశముపై సులభముగ దండెత్తివచ్చి కోట ముట్టడించిరి. రాజు తన శత్రువులతోఁ గొంతదనుకఁ బోరాడి రణరంగమునఁబడి వీరస్వర్గమున కరిగెను. వానియంతఃపురస్త్రీలావార్త విని ఖడ్గములతోఁ బొడిచికొని దేహములుపడి వీరస్వర్గమునకుఁ బోవుభర్త ననుగమించిరి. వారిలోఁ బట్టపురాణి కొకఁడే కుమారుఁడుగలఁడు. ఏఁడాదివాఁడు. ఆశిశువు శత్రువుల బారిఁ బడకుండ నొకదాది కప్పగించి వీనిఁ బ్రచ్ఛన్నముగా నేయరణ్యమునకయినఁ గొనిపొమ్ము. రాజ్యము వలదు, భోజ్యము వలదు. భాగ్యమువలదు, భోగ్యమువలదు. ఏయడవినయినఁ బ్రాణములతో బ్రతికియుండినఁ జాలును. నీవే వీనికిఁ దల్లివి. నిర్భాగ్యురాలను. నాగర్భమున జనించుటచేత వీని కిట్టికష్టములు వచ్చినవి. నీవంటిదానికడుపునఁ బుట్టిన నిర్భయముగా కలియో గంజియో త్రాఁగి బ్రతుకునుగదా. సర్వమునకు నీవే వీనికి గతి యని యప్పగించి చితి కల్పించుకొని యందుఁ బడి కుల

పాలికాధర్మమున భర్తృసహగమనము చేసెను.

దాది తననేర్పున వానిని ప్రచ్ఛన్నముగా నొకయరణ్యమునకుఁ గొనిపోయి యచట నొకగొల్లగూడెము చేరి యందొకనియింట మార్గస్థురాలువలె బసచేసెను. ఆయింటివారికి సంతతిలేదు. మేఁకలమంద కలదు. ఆశిసువునకుఁ గావలసిన మేఁకపాలాయింటియజమానురాలు దాదికిచ్చి వానిముద్దుమోము చూచి ముద్దాడి "అమ్మా! యీశిశువు నీగర్భమునఁ బుట్టినవాఁడా? కాఁడా యను సందేహము గలిగినది. నిజము చెప్పు మని యామె నడిగెను. సత్యము చెప్పినయెడల శిసువున కేమి యపాయము వాటిల్లునో యని యాలోచించి సత్యాసత్యమిశ్రిముగా "నాగర్భమునఁ బుట్టినవాఁడుగాఁడు. నే నొకనగరప్రాంతమునుండి పోవుచుండఁగ నొకపుంతలో దొరకినాఁడు. వీనిముఖవిలాసము చూడఁ బెంచుకొన బుద్ధి పుట్టి తీసికొని మాయూరికిఁబోవుచు దారితప్పి యరణ్యమునకు వచ్చితిని." అన యజమానురాలామాటలు విని యీపిల్లవానిని దనకిచ్చిన బాగుగా నుండు నని యాసకొని యేమియుఁ బైకిఁ దేలక "యీశిశువు మహారాజకుటుంబమునఁ బుట్టవలసినవాఁడు గాని సామాన్యకుటుంబమునఁ బుట్టవలసినవాఁడు గాఁడు. వీనిఁ గన్నతల్లి యెంత యదృష్టవంతురాలో. ఎంత యదృష్టమున్న నేమి వీనిని జూచుకొని సంతోషించుభాగ్యమామెకు లేకుగాఁబోయె. ఇట్టిపిల్లవాని నెట్టు లెడఁబాసియు

న్నదో” అని యన మార్గస్థురాలు “అమ్మా! మన కవి
యన్నియుఁ దెలియవు. ఇట్టివి సంభవించుట కెన్నియో కార
ణము లుండును. మన మీవిషయము బయటఁబెట్టితి మేని
రాజదూతలు విని మనల ననేకవిధముల బాధపెట్టుదురు.
మాయూరికిఁ గొనిపోయిన నెవ రేరీతిని బరీక్షలుచేసి బాధలు
పెట్టెదరో యని సందేహించుచున్నాను. బాలునిఁ జూచిన
విడువబుద్ధిపుట్టక తీసికొనివచ్చితి.” నన, ఆమాటలలోనియావకా
శమును గ్రహించి యజమానురాలు “అమ్మా! మీయూ
రికిఁ గొనిపోయిన బాధ లుండునేమో. మాయూర నేబాధ
లును లేవు. ఈయరణ్య మంతయు నాభర్త చేతిలోనిది. వాని
యాజ్ఞ లేకుండఁగ రాజదూతలే గాదు రాజయిన నడుగుపెట్ట
లేఁడు. ఈబాలునితో నీవిచ్చటనే యుండుము. మీ కేలో
టమును గలుగనీయను. నీ కావశ్యకమయినచో దారు లెఱిఁ
గినవాని నొకనిఁ దోడుగా నిచ్చెదను. మీయూరికి నీ వొక
తెవు వెడలి మరల రమ్ము. బాలునికిఁ గావలసిన యుపచా
రము నేను చేయుచుందును.” అన మార్గస్థురాలు సందర్భ మను
కూలముగానే యున్న దని యెంచి తా నచట నున్నచో
శత్రుభటులు “బాలుఁడు రాజకుమారుఁ” డని గ్రహింతు
రేమో యనియుఁ దాను కుసుమపురమున లేకున్నచో రాజ
కుమారుఁడును వానిదాదియుఁగూడఁ గనఁబడలేదు. పరిచ్ఛన్ను
లయి యుందు రని యనుమానపడుట కవకాశము గలుగు

నేమో యనియు నూహించి తా నచట నుండుట దగ దని నిశ్చయించుకొని " అమ్మా! నీవట్టు బాలుని బోషించుచుండుము. నేను మాయూరికిం బోయి యీబాలునిపైం బ్రేమ పొడమినపుడు వచ్చి చూచిపోవుచుందును." అని చెప్ప యజమానురాలు మహానంద మొంది తనభర్తకుం దెలుప నతండును పరమేశ్వరుండు మన కీరీతి నిట్టిసుపుత్రు నను గ్రహించె నని సంతసించెను. మఱునాండు మార్గస్థురాలు పరులసాహాయ్య మక్కఱలేకయే తనయూరికిం బోయెద నని వెడలిపోయెను. ఆగోపదంపతుల యాదరమున నాబాలుండు శుక్లపక్షచంద్రుని వలె దినదినాభివృద్ధి నొందుచుండెను. ఆబాలుండు పెంచుచున్నవారిని దల్లిదండ్రులే యనుకొనెను. ఇరుగుపొరుగుపిల్లలతో నాటపాటలు నేర్చుకొనుచు మేకలను మేపుచు వ్యవసాయమునం దండ్రికిం దోడ్పడుచుం దనవయసునకు మించిన సమర్థతతోం దల్లిదండ్రు లనుకొనిన గోపికాగోపకులకు నిరుగుపొరుగువారికి నానందము గలిగించుచు నుండెను. ద్వాదశాబ్దములు దాంట వచ్చినవి. వాని నప్పగించినదాది గూఢముగా నప్పుడపుడు వచ్చి వానియోగక్షేమములు దెలిసికొనిపోవుచుండెను. ఆబాలుండు జన్మమున రాజబాలుం డయినను, సహవాసవశమున గోపబాలుండేయని యాతండు భావించుకొనుటయే కాక బుద్ధిసంస్కారము, నడవడియు గోపబాలపద్ధతినే పట్టువడుచుండుట దాదిచూచి యింకను ముదుర

నిచ్చినచో రాజకుమారయోగ్య మగు విద్యాబుద్ధులు, సాహ సధైర్యములు పట్టువడ వని యెంచి వాని యథార్థస్థితి వాని కిఁ దెలిపి వానిభావము ననుసరించి వానికి శస్త్రాస్త్రవిద్యలు నేర్చుకొనుసాధనము దొరకునేమో చూడవలయు ననుభావ ముతో గూఢముగాఁ గాక ప్రకాశముగా గోపగృహమునకుఁ బోయెను. గోపస్త్రీ యామెను జూచి "చిరకాలమునకు వచ్చి తివమ్మా! యింతకాలము మమ్ము మఱచియుంటివా! నేఁడు సుదినము." అని తనకుమారునిఁ జూపి "వీఁడే నీపిల్లవాఁడు, నీవు గుర్తుపట్టఁగలవా?" అన నామె "గుర్తు పట్టకేమి? వయసువచ్చినను ఆవిశాలఫాలము, ఆకర్ణాయతలోచనములు, ఆకనుబొమలసొంపు, ఆబుగ్గల నిగ్గు, ఆవక్షము వెడఁదతనము, ఆచేతులయాజానుదీర్ఘత్వము, ఆసింగముననుము మించిన నడుము, ఇది యది యన నేల? ఆసింహసహనసత్వము, ఇత రులకుఁ గలదా? నాఁడుమొదలు నేఁటివఱకుఁ బ్రతిక్షణము వీనిరూపము దినదినాభివృద్ధమయి నాకన్నులఁ గట్టినట్లేయున్న ది. కారణాంతరమునఁ బ్రత్యక్షముగాఁ జూచి సంతసింపఁ వీలుచిక్కదయ్యె." అనుచు బాలుని వీఁపుపైఁ జేతితో నిమిరి ఏదియో మనమునఁ దలఁచికొని కంటఁ దడిపెట్టెను.

అట్లు కంటఁ దడిపెట్టుచుఁ బ్రేమార్ద్రహృదయత్వ మును బ్రకటించు నామెను బాలుఁడు జూచి, తాను మాత యని భావించు గోపాంగనతో "అమ్మా! ఈమె యెవరు?"

అని యడుగ "ఈమెయే మీతల్లి. ఈమె నాకు నిన్ను సమ
ర్పింప నేను పెంచితిని" అనెను. బాలుఁడామాటవిని "జననీ!
నమస్కార"మని దాదికి నమస్కరింపఁబోవ నామె నివారించి
"కుమారా! మీజనని జీవించియుండిన నీకీపాట్లేమి ?"
యనెను. బాలుఁడామాట విని "ఇదేమి మీరుభయులు
గాక నాకు వేఱొకజనని యుండెనా? ఆమె మృతినొందెనా?
ఏమిది? నాజన్మవృత్తాంతము వచింపుము" అని ప్రార్థింప నామె
గోపాంగనతోఁ "ఇఁక లెవ్వరును నిక్కడ లేరుగదా! ఈవృ
త్తాంతము మనలోనేయుండవలెను." అని "కుమారా! నీజన్మ
వృత్తాంతము వినుము. నీవు రాజశేఖరుఁడను కుసుమపురాధి
పతి పట్టపురాణికిఁ బుట్టినవాఁడవు. నీతండ్రిపురముపయి శత్రు
వులు దాడివెడలిరా నీజనకుఁడు వారితోఁ బోరిపోరి రణరం
గమున మృతుఁడయ్యె. నీజనని కులపాలికాధర్మమున వాని
తో సహగమనముచేసెను. ఆమె నిన్ను నీకు దాదినగు నా
కప్పగించినది. శత్రువులు నీకపాయముచేయుదు రనుభయ
మున "నేయరణ్యమధ్యమమునందయిన వీనినిఁ గాపాడుచుండు
ము, ఎక్కడనయిన ప్రాణములతోఁ బ్రతికియుండినఁ జాలునని
చెప్పెను. ఆశత్రువులు కుసుమపురము నాక్రమించుకొని
యిపుడు పాలించుచున్నవారు. నేను నిన్నీమెకప్పగించితిని.
ఈమెయే పెంచినది. నీవు కుసుమపురమున నున్న నేదోయ
పాయము వచ్చియేయుండును. నేను గూఢముగా వచ్చి చూచి

బోవుచుంటిని. పరులకుఁ బట్టువడుదు మేమో యనుభయ ముననఁ జిరకాలముగాఁ బలుకరింపనయితిని. ఈమెతో నీవాక పుర ప్రాంతమున దొరకినవాఁడ వని వచించితిని." అని గోపాం గనతో "నీతో నసత్యము చెప్పినందులకు క్షమింపు" మన "అయ్యో! అది యసత్యము కాదు. ధర్మసూక్ష్మప్రకారము సత్యమును మించిన ధర్మము. మొదటనే కుసుమపురాధిపతి పుత్త్రుఁడ వని వచించిన నెన్ని యో బాధలు సంభవించియే యుండును. ఇప్పుడు కుసుమపురము నాక్రమించిన రాజీన డుము వేఁటకై యీయరణ్యమునకు వచ్చి మాయింట నొక పూఁట నాతిథ్యముగొని పోయెను. అతఁడు వీనినిజూచి మా బాలుఁడే యని భావించెను గాని వీనికి శస్త్రవిద్యలు నేర్పించినచో మాక్షత్రియకుమారుని మించినవాఁడగు" నని ప్రశంసించెను. కుమారుఁ డామాట విని "అతఁడాకుసుమపుర మాక్రమించినవాఁడు. నేను కుసుమపురాధిపతిపుత్త్రుఁడనా? మాజనని చచ్చిపోవుచు నేనెక్కడనయినఁ బ్రాణములతో బ్రతికియుండినఁజాలునన్నదా! బ్రతికియున్న చో నే నాఁటికయినఁ బగవారు తనభర్తకుఁ జేసినపరాభవమునకుఁ బ్రతిపరాభవము గావించెదనని భావించినదికాఁబోలు. ఆమెసంకల్పము నెఱవే ఱకుండునా? నీవు దాదివిగదా, అదిగాక నాస్వస్వరూపము తెలిపినతల్లివి నీవు. నీవు నమస్కారార్హురాలవే. నమస్కరిం పనిమ్ము" అని నమస్కరింపఁబోవ వానిచేతులు పట్టుకొని

“కుమారా! వర్ధిల్లుము. క్షత్రియోచితవిద్యలు నేర్చికొ
నుము.” అని దీవింప నాతఁడు పెంపుడుఁదల్లికి దండము పెట్టఁ
బోవ నామె “రాజకుమారా! న్యాయముకాదు. ఈక్షణ
మునఱకు నీజన్మవృత్తాంతము తెలియక నాపుత్త్రుఁడ వనియే
తలఁచి నిన్నుఁ జనవునఁ బెంచితిని. నీవు రాజకుమారుఁడవు.
క్షత్రియోచితవిద్యలు చెప్పింపక మాయిరుగుపొరుగుగొల్లపిల్ల
లతో మేఁకలను మేపుట నేర్పించితిని. ఎంతయపచారము
చేసితిని? నీ వింక నమస్కారము చేయరాదు.” అని నివారింప
“అమ్మా! అట్లనకుము. ఈదేహము నీదే. నీసెలవయినచో
నస్త్రశస్త్రములు నేర్చికొనెదను. లేనిచో మేఁకలను మేపుకొ
నుచు నుండెదను.” అన నామె “నా సెలవు అనుచున్నావేమి.
నేను నాభర్తయు స్వయముగా నీప్రాంతమున నున్న యాశ్ర
మమున నప్పగించెదము. అచ్చట నొకమునీశ్వరునొద్ద క్షత్రి
యకుమారు లెందఱో వచ్చి వానిశుశ్రూషచేసి యస్త్రము
లును శస్త్రములును నేర్చుకొనుచుందురు. నీవు క్షత్రియపు
త్త్రుఁడ వని వాని కెఱింగించినచో నాతఁడు నిన్ను శిష్యు
నిగాఁ గొనును. మాయం దామునీశ్వరున కెంతయో విశ్వా
సము. వారి కప్పుడప్పుడు పాలు పండ్లు పట్టుకొని వెడలి
యిచ్చెడివాఁడవు ఎఱుఁగవా?” అన “నే నొకమాఱు పాలు
తీసికొనిపోయినపుడు “నీవు క్షత్త్రియబాలుఁడ వయి యుండిన
నీకు శస్త్రాస్త్రవిద్య లన్నియు నొకమాసములోనే బోధించి

యుందునురా " యనిరి. ఈక్షణముదాఁక గొల్లవాఁడ నని చెప్పుకొని యింకమీఁద క్షత్త్రియుఁడ నని చెప్పుకొనిన నన్నెవ రయిన నమ్ముదురా ? పైపెచ్చు నవ్వుదు రేమో. " అనియెను.

గోపాంగన వానిమాటకుఁ జిఱునగవు నవ్వి " నాయనా ! నిన్ను నేను బెంచుచున్నానని వా రెఱుఁగుదురు. నీవు క్షత్త్రియకుమారుఁడ వని తెలియవచ్చిన దని నేను చెప్పిన నమ్ముదురు లే. సందేహపడకుము. ఇంకను గొంతకాలము కుసుమపురాధిపతిపుత్త్రుఁడ వని ప్రకాశముగాఁ జెప్పరాదు." అనఁగా, దాదితోను పెంపుడుఁదల్లితోను "నామనవి వినుండు. నేను కుసుమపుర మాక్రమించినరాజు నోడించి కుసుమపురము స్వాధీనపఱచుకొనుక్షణముదాఁక నేను గుసుమపురాధిపతిపుత్త్రుఁడ నెట్లగుదును ? అప్పుడే గాని నాజన్మవృత్తాంతము సత్య మనుటయెట్లు ? నేను ప్రచ్ఛన్నవేషముతోఁ గొంతకాలము తిరిగి క్షత్త్రియబాలబృందమునఁ జేరి విద్యలు నేర్చికొని వచ్చెదను. నన్ను విడిచిపెట్టుఁ"డన వారును మిగులఁ గష్టముతో నొప్పుకొనిరి.

అంత నతని మనోభావము లన్నియు మాఱిపోయినవి. రూపమునఁగూడ మార్పుగలిగెను. ఆగోపబాలవేష మే యంతర్థాన మయ్యె. అతఁడు దరిద్రక్షత్త్రియబాలుని వేషముతో నొకయాశ్రమమునకుఁ బోయి విద్యార్థిబృందమునఁ జేరెను. గురువులు వానిరూపమునుబట్టి క్షత్త్రియుఁ డని

నిశ్చయించుకొనుటచే నీ వెవర వను ప్రశ్నమే యడుగలేదు. నలువురతోఁ పాటు విద్యాదానార్హతను గలిగించు విద్యోపన యనము గావించి వానికి శస్త్రాస్త్రవిద్యలు వేదవేదాంతములు రాజనీతిపద్ధతులును బోధించిరి. ఏకసంధాగ్రాహి యగు నత నికి రెండవమాఱు బోధింపనక్కఱయే లేకపోయెను. అత్య ల్పకాలముననే యతనిసహాధ్యాయుల కతఁడు గురువయ్యె. వానిబుద్ధివిశేషము చూచి గురువులును పరమాస్యములగు ధను ర్విద్యావిశేషములు స్వల్పకాలముననే బోధించిరి. సహాధ్యా యు లగు రాజకుమారు లందఱును తనకు శిష్యప్రాయు లగు టచే వారిసాహాయ్యమునఁ గొంతసేన చేర్చుకొని కుసుమపుర ముపై దాడివెడలి రణరంగమున వైరివీరులకు వీరస్వర్గ మిప్పించి యప్పుడు తనదాదిని, పెంచినతల్లిదండ్రులను బిలి పించి వారిముఖమున వానిజన్మవృత్తాంతము లోకమున కెఱిఁ గించి స్వరాజ్యమునఁ బట్టాభిషిక్తుఁడయ్యెను.” ఇది వేదాంత ప్రవచనమున మాతండ్రి బోధించినకథ.

గు—అమ్మా! వేదాంతమున నీకథ యెందులకు వచ్చినది. ఇది రాజనీతిప్రసంగమున రావలసినదే.

విశ—కుమారా! నీవు బాలుఁడవుఅయినను విను. మనయాత్మ ఈదేహమునఁ గట్టువడి దేహధర్మము లగు దుఃఖ ము లన్నియుఁ దనపైఁ బెట్టుకొని దుఃఖాత్ముఁడను, హీనుఁ డను, నీచుఁడను, మాయావశుఁడను అని భావించి నీచభా

వము నొందును. అపుడగు గురువు. "నాయనా! నీయాత్మ ఆనందస్వరూపము. దుఃఖములు దేహసంబంధములు. మాయావశుఁడవు గావు. స్వతంత్రుఁడవు. నీవు నీచుఁడవుగావు. బ్రహ్మస్వరూపుఁడ" వని బోధింపఁగా నాతఁడు బ్రహ్మానంద మొంది పూర్వనీచభావమును బూర్తిగా విడిచి యానందస్వరూపుఁ డగును. అని బోధించి దానికి దృష్టాంతముగాఁ బయికథ చెప్పిరి.

గరు—బాగుబాగు. నాకును సమయానుగుణముగా సరిపోయినది. నేను దాసుఁడగాను స్వతంత్రుఁడను. దాస్యము దాస్య మనుకొనుట తప్పు. దాస్య మఱనిమిషములో నంత రింపఁజేయుదును. కశ్యపబ్రహ్మపుత్త్రుఁడనా! వినతాగర్భ సంభవుఁడనా! నాకుదాస్యమా! నాజననికి దాస్యమా! హా! హా! చూడు. అమ్మా! నన్ను స్వేచ్ఛగా విడిచితివా కాద్రవేయుల నఱగడియలోఁ జంపెదను.

వినత—కుమారా! క్రౌర్యము కూడదు. "అహింసా పరమోధర్మః" అనువాక్యము హృదయఫలకమున లిఖించి యుంచుకొనుము. శాంతి, శాంతి, శాంతి, శాంతమార్గమున మనకు దాస్యనివృత్తి గావలెను.

గరు—తల్లీ! నీమాట దాఁటనేరను. కోపవశమున నట్లంటిని. కాని వారిని మెప్పించి వారివలన విముక్తిపత్త్రము పుచ్చు

కొనుమందువు, సరే. వారు మెచ్చుకొనుదాఁక దాస్యము చేయఁగలనా ?

వినత—నాయనా! అదియే సహనము. అదెంత! నీహృదయమున నది దాస్యమే యనుకొనరాదు. అది దాస్య విమోచనసాధనమే యనుకొనుము. గ్రుచ్చుకొన్న ముల్లు తీసి వేయుటకు ముల్లేగదా సాధనము. కుమారా! పగవారిపైని పగగాదు పెంచికొనవలసినది. సహనము. అపకారమునకుఁ బ్రత్యపకారము గాదు, ఉపకారము చేయవలసినది. వారిదుష్కృత్యములకుమాఱు సత్కృత్యములే యాచరింపఁదగినవి. అవియే పగవారిగుండె బ్రద్దలుసేయును. శస్త్రాస్త్రము లక్కఱలేదు.

గరు—అమ్మా! అట్లే చేయుదును. అని మాటలాడుచుండఁగఁ గద్రువ సెలవయినది రమ్మని యొకతె పిలువ వినత వెడలెను. గరుత్మంతునిహృదయమున నాలోచనాతరంగము లాకసమంటుచున్నవి. మరలఁ బాతాళముక్రిందికి దిగిపోవుచున్నవి. ఆతనియాలోచనాదృష్టికిఁ గ్రింద భూమియు బైని యాకాశమునుగూడఁ గానరావు. అంతలోఁ గాద్రవేయులాతనిఁ బిలువ నతఁడును వెడలెను.

వారిపని చావుతప్పి కన్నులొట్టపోయిన ట్టయినదిగాన వీఁపుపై నెక్కఁదము. ఆలోకమునకుఁ గొనిపో ఈలోకమునకు గొనిపో అన్నమాటలు పోయినవి. మైత్రిచూపుచు చిన్నచిన్న యాలోచన లతని గుచు నాటుచుఁ బాటుచుచుండెను.

# దాస్యవిమోచనోపాయము

ఒకనాఁడు కాద్రవేయులు గరుత్మంతుని బుద్ధివిశేష
మునకును బలవిశేషమునకును సంతసించి "నీవు బహుమాన
మున కర్హుఁడవు. మాయొద్ద నున్నవానిలో నీకభిలషితమేదో
తెలుపుము. నీకీయఁదలఁచితి" మన, నాతఁడు "మీయొద్ద నున్న
పదార్థ మేదియో నాకిచ్చుట కేమి. పదునాలుగులోకముల
లోను మీకుఁ గావలసినపదార్థ మేదో మీరు గోరుఁడు నేను
తెచ్చి యిచ్చెదను. దానితో మీకు సంతుష్టి గలిగెనేని మా
మాతయుం దారోపించిన దాస్యము విడుచుకొనుఁడు. దాన
నేమును మామాతయు దాస్యవిముక్తుల మగుదు" మనియె.
అంత వారు దాని కంగీకరించిరి గాని వారు కోరుపదార్థ మే
దియో యాలోచించి చెప్పెద మని యరిగి కద్రువకు జరిగిన
దంతయుఁ దెలుప నామె "మీర లూరకుండ లేరుగదా. వానికి
దాస్యవిముక్తి గలిగిన మిమ్ము బ్రతుకనిచ్చునా? గంభీరముగా
నుండుఁడు. ఏమాటయుఁ దేలకుఁడు. అతఁ డసాధ్యుఁ డని
యెన్నిమాఱులోఁ జెప్పితినిగదా!" అనఁగా కుమారులలో
నొకఁడు, "అమ్మా! నీవెంత చెప్పినను వానియెదుటఁ బడు
నప్పటికి మాకుఁ దలలు వంగిపోవును. నోరు లేవదు. మనస్సు
భక్తినమ్రమగును. అతఁడు కోరినట్లు దాస్యవిముక్తికి మన
మంగీకరింపవలె" ననెను. అదిగాక అతని కట్టిదుష్బుద్ధి యున్న

చో నిపుడు మనల నందఱనుగూడ నరనిమిషములో జంపివే యఁగలఁడు. మమ్ము వీఁపుపయి నెక్కించుకొనిపోవునపుడు విమానములమీఁదఁ బోవు దేవతలుగూడ భయమునఁ దప్పుకొనిపోవుచుండెడివారు. అమ్మా! అతఁడు సామాన్యుఁడా.''

కద్రువ—ఆతని కట్టి దుర్బుద్ధి లేకపోలేదు. వినత నిజముగా సత్యసంధురాలు. వాని కెని విధములనో శాంతి బోధించినదఁట. చాటుననుండి వారి సంభాషణము విన్నవా రు చెప్పినారు.

కుమా—ఆతనికిని వానితల్లికిని దాస్యవిముక్తి చేయక తప్పదు. ఆవిషయమున భిన్నాభిప్రాయము మాకు లేదు నీకును వలదు. మనము కోరఁదగినపదార్థమేదియో యదియే నిర్ణయింపవలెను.

కద్రువ—అట్లయినచో, దేవలోకమున మహేంద్రాజ్ఞానుసారమున సురక్షిత మగు నమృతము తెమ్మనుఁడు. అది వానికి శక్యముగాదు. అతఁ డది తెచ్చియిచ్చినపుడుగదా విముక్తిప్రశంస. ఒకవేళ తెచ్చియిచ్చినా అది మీరాస్వాదించినచో వానివలననే కాదు, ఇంక నెవరిమూలముననుమీకు మృతి యుండదు. అమరత్వము సిద్ధించును. వాని కంతకసి యున్నచో మిమ్ము బాధింపవచ్చును గాని చంపలేఁడు.

కుమా—అమ్మా! బాగుగా నున్నది. అట్లమృతము తెమ్మని కోరెదము అన వారందఱును దాని కంగీకరించి గరు

త్మంతుని బిలిపించి దేవలోకమున నున్న యమృతము గొని రమ్మా. నీకోరిక నెఱవేర్చెదము. అని చెప్పిరి.

గరుత్మంతుఁడు దాని కొప్పుకొని తల్లిసన్నిధి కరిగి “ అమ్మా! యమృతము దెచ్చి వారి కిచ్చినచో మనకుదాస్యవిముక్తి యగు ననిరి. ఇప్పుడే యమృతాహరణమునకై వెడలఁదలఁచితిని. అది దేవతలసంరక్షణమున నున్నది. సామాన్యముగా వారు తీసికొని రానిత్తురా ? వారడ్డురాక యుందురా. వచ్చిననుసరే వారల యుద్ధమున నోడించి యమృతము దెచ్చెదను. అమ్మా ! యుద్ధప్రసంగము తలఁచికొన వీరత్వావేశమున శరీరమంతయుఁ బొంగిపోవుచున్నది. ఆఁకలి యధికమగుచున్నది. ఈయాఁకలి దీర్చు పదార్థము తినినఁగాని తగినబలము చేరదు. బలము లేకున్నచో దేవతలతోఁ బోరుటెట్లు? అట్టిబలము సంపాదింపఁదగిన యాహారమావశ్యకము. ఆకు, అలము, కాయ, పండు తినుటవలనఁ బ్రాణములు నిలఁబెట్టుకొనవచ్చును గాని యుద్ధము చేయుటకుఁ దగినంత బలపౌరుషములు గలుగవు. “ మాంసం మాంసేన వర్ధతే ” అందురుగదా. మాంసము యోద్ధలకుమంచియాహారమే. కానిదాని యందు హింస తప్పదు. శాకాదిభక్షణమునను హింస కలదు. హింసాహింసల నిర్ణయ మతికష్టము. నీవు మాతృదేవతవు. నాకుఁ దగినయాహార మేదో నిర్ణయించి చెప్పుము. ” అన నామె యిట్లనియెను. “హింసాహింసలనిర్ణయము కష్టమే కాని

అన్నిటియందును హింస తరతమభావమునఁ గలదు. అది శిష్ట
రక్షణమునకో దుష్టశిక్షణమునకో తోడ్పడినచో నింద్యము
గాదు. ధాన్యాద్యాహారమున జీవించువారికి నన్నము పచన
మగునప్పటికి ఎన్నియో సూక్ష్మజంతువులు హింసింపఁ
బడును. కేవలముస్వోదరపూరణమునకై కాక యతిథులకు నభ్యా
గతులకు, దేవతానివేదనమునకు, కాకాదిబలులకు మొదట
నుపయోగించి శేషము యజమానుఁడు తనపోష్యవర్గముతో
భుజింపవలయు నని పెద్దలు వచించిరి. మాంసాహారులు తమ
గృహములలో నెంతయో నమ్మకముతో జీవించు జంతువుల
గొంతుకలు నులిపియో, నఱకియో, వానినిఁ గాల్చియో
మాడ్చియో తినుట భావ్యము గాదు. అడవులకుఁ బోయి
యందు జనులకో జంతువులకో బాధ గలిగించు జంతువులను
వేఁటాడి వానిమాంసము భుజింపఁదగును. దానఁ గొంత దుష్ట
శిక్షణమును, గొంతశిష్టరక్షణమును గలవు. కావుననే వేఁట
హింసాభూయిష్ఠమయినను, క్షత్త్రియధర్మావలంబులకు నిషి
ద్ధము గాదు. హింస యున్నదని నీవు మాంసము మానరాదు.
దానివలన సజ్జనబాధ గలిగింపఁగూడదు. చూడుము. సము
ద్రమధ్యమున నొకద్వీపములోఁ గొన్నినిషాదసంఘములున్నవి.
ఆసంఘములవారు ప్రజలధనధాన్యాదులు దోఁచికొని తిని
క్రొవ్వియున్నవారు. ఆదుష్టులఁ జంపుకొని తినుము. అందును
ధర్మపరులు కొందఱుందురు. వారిని బరిహరించునది. నీకు

సమస్తశక్తులు సమయానుగుణముగ సంభవించి యమృతకల
శాహరణమునఁ దోడ్పడుఁగాత."

అని పలుకు తల్లిపలుకులు విని యుత్సాహభరితుఁ
డయి తల్లికి నమస్కరించి యాకాశమార్గమున వెడలి నిషాదు
లుండు ద్వీపమునకుఁ బోయి వారిఁ జంపుకొని తిని పోవుచుఁ
బోవుచు మార్గమధ్యము నొకయాశ్రమమునఁ దపముచేయు
చున్న కశ్యపునిఁ జూచి తండ్రి యని గ్రహించి క్రిందికి వ్రాలి
వానికి నమస్కరించెను. కశ్యపుడు కద్రూవినతలను విడిచి
వచ్చినది మొదలు జరిగినవృత్తాంత మంతయు శిష్యముఖమున
నెప్పటి కప్పుడు వినుచునే యున్నవాఁడు గాన గరుత్మంతుఁడు
తన కొడు కని గ్రహించి వాని కాశీర్వాదము చేసి వినతా
దుల యోగక్షేమము లడిగి తెలిసికొని తమదాస్యవిమోచన
సాధనముగా నమృతకలశము దీసికొని రాఁబోవుచుండుట విని
సంతసించి "వైనతేయా! మాతృదాస్యవిముక్తికై మహారం
భము నవలంబించిన నీకు మహేంద్రుఁడుగూడ విధేయుఁ
డగును. వానివజ్రాయుధము నీయెడ వ్యర్థమగును. దాని కట్టి
శాతనము లున్నవి. అమృతానయనమున నీకు జయము గలు
గుఁగాత" మని యాశీర్వదించెను. అంత గరుత్మంతుఁడు "తం
డ్రీ! మీయాశీఃప్రభావముననే జయము గలుగును. నే నమృత
కలశము దీసికొని వచ్చునపుడు దేవత లడ్డురాక యూరకుం
డురా! వారితో యుద్ధముచేయక తప్పదు. భావియుద్ధాలో

చనమునసే నాకు క్షుత్పిపాస లధికము లగుచున్నవి. తగిన యాహారమేదో నాకు నిర్ణయింపుము. " అనిప్రార్థింప నతఁ డిట్లనియె. " కుమారా! క్షుధానివృత్తి కేకూ నాకు లయినఁ జాలును గాని యుద్ధార్హమగు బలము గలుగుటకు మాంసా హార మావశ్యకమే. అది రజోగుణమును వృద్ధిచేయును. కేవ లము సత్వగుణమునఁ దపోనిష్ఠలో నుండువారికిని, కేవలము తమోగుణమున నలసతతో జీవితము గడపు నిద్రాళులకును ఏదో యొక తుక్కు చాలును. కాని రజోగుణము వృద్ధిచేసికొని యుద్ధమునఁ బ్రవర్తించువారు మాంసాహారము గొనుట యావ శ్యకము. అందును గజకూర్మమాంసము బలపౌరుషకరము. ఏజంతువయినను కసితో నున్నపుడు దానిని జంపి భక్షించిన వారికిఁ గసి, శత్రువులపైఁ గక్ష, వారిని జంపవలయు నను చలము హెచ్చునగును. కావుననే వేఁటలో జంతువును బుఱి కొల్పి యది కసితోఁ దనపైకి వచ్చునపుడు దానిని జంపి దాని మాంసము తినవలెను గాని మూలుగుచు మూల నిక్కిపోవు చుమృతప్రాయగానున్న దానిని బొడిపించి తినుట యుపయో గకరము గాదు. ఎవరికయినను ఆహారానుగుణమగు గుణములు గలుగుట సహజము. నీకట్టి గజకూర్మములు లభించుతావు చెప్పెదను. వాని పూర్వజన్మవృత్తాంతముగూడ దివ్యదృష్టి తోఁ దెలిసికొంటిని. అవి పరస్పరద్వేషముతోఁ జలముపూని నిత్యముపోరుచున్నవి. వానిపూర్వోత్తరములు వినుము.

# సోదరులు, ద్వేషము.

మున్ను విభావసుఁ డను నొక బ్రాహ్మణుఁ డుండెను. ఆతఁడు విద్యావంతుఁడు, నియమవంతుఁడు, ధనధాన్యసంపన్నుఁడు. వాని కెన్నియో సుగుణము లుండెను గాని కోపము మాత్ర మెక్కువ. ఆతని కొక యనుజన్ముఁ డుండెను. ఆసోదరు లిద్దఱును పిత్రార్జితమగు ధనమును గలిసియుండి యనుభవించుచుండెడివారు. పెత్తన మన్నయే చేయుచుండెను. తనభాగము పంచుకొని తానే వ్యవహరించుకొనవలయు నని తమ్మునకు బుద్ధిపుట్టినది. పంపకము పెట్టు మని యన్న నడిగెను గాని యన్న దాని కంగీకరింపక తమ్మునికి హితోపదేశము చేయఁబూని యిట్లు వచించెను— "సోదరా! మనము విభక్తుల మయినచోఁ గుటుంబగౌరవము తగ్గును. కుండ వేరైన గుణము వేఱగు నందురు. విభక్తుల మయినచోఁ బరస్పరానురాగము తగ్గిపోవును, స్వలాభమాత్రపరత్వముగల్గును. కొందఱువంచకులు మనలో మనకు భేదములు గల్పింతురు. అప్పుడు మనము బలహీనులమయి కార్యసాధనమున కనర్హుల మగుదుము. చూడుము. తృణపుంజము నొక త్రాడుగాఁ జేసినచో మదపుటేనుఁగులనుగూడఁ గట్టును. ఆతృణములను విడివిడిగా నుంచిన నేమియుఁ జేయఁజాలవు. అది గడ్డిపఱకలేగదా యుండును. సోదరులు లేనివారు పరులతో సఖ్యము

చేసికొని సోదరన్యాయమునఁ గలిసియుండ మని కోపగొం
దురు. నీవు సోదరునితో విడిపోయెద ననెదవేమి? అవిభక్త
కుటుంబములోనివారి కున్న సౌఖ్యము, గౌరవము, లాభము
విభక్తకుటుంబములోనివారి కుండునా? పంపకము కూడని
పని." అని యెన్ని విధముల బోధించినను తమ్మునికామాటలు
రుచింపవయ్యె. మఱికొంతవిపరీతభావ మెక్కువయయ్యె.
ధర్మబోధముచేయువాఁడు ఫలానపేక్షి యయిన యెడల
బోధము ఫలించునుగాని ఫలాపేక్షియయినచో స్వలాభపరత
తోఁ జెప్పినాఁ డని తోఁచకమానదు.

చిన్నవాఁడు " అన్నా! పంచుకొని న్యాయముగా వ్య
వహరించుకొనినచో స్వాతంత్ర్యము గలుగును. దానఁ గష
సుఖములు నాలును. దేవతాపితృదేవతాపూజలు రెండు
రెండగును. వారికిని సంతోషము ద్విగుణ మగును. విభాగ
ము సర్వవిధములను మంచిదియే. అవిభక్తస్థితిలోనే పరుల
మనలో మనకు విరోధము గలిగింప నవకాశమున్నది. వీరు
తినుచున్నా రని వారితోను వారు తినుచున్నా రని వీరి
తోను జెప్పుదురు. విభక్తులతో నేమి చెప్పఁగలరు. విభాగము
చేసికొని దూరముగా నున్నచో నున్న మైత్రి నిలఁబడును.
లేకున్న విరోధములు బలియును. తర్వాత విడిపోయితి మేని
జన్మజన్మాంతరములకైన విరోధము తప్పకుండును. విభాగమే
సర్వవిధముల శ్రేయోదాయకము: " అని ప్రతివాదముచే

యుఁ గోపశీలుఁడగు నన్ను సరియగు సమాధానము చెప్పక సహనము లేక "ఓయి మూర్ఖుఁడా! పెద్దలచెప్పుచేఁతలలో నుండక నిరంకుశగజమువలె విహరింపఁజూచుచున్నావు గావ గజజన్మ మెత్తు" మని శపించెను. తమ్ముఁడును శపించుటకు సమర్థుఁడే కాన "నీవు కూపకూర్మన్యాయముగా నింటఁబడి యుండి లోకజ్ఞానము లేక నామాటకు సమాధానము చెప్ప లేక కోపమున నన్ను శపించితివి గాన నీవు కూర్మజన్మ మెత్తు" మని ప్రతిశాపమిచ్చెను. శాపశక్తి గాని శస్త్రశక్తి గాని సహనస్వభావము లేనివారి కున్నయెడల ఫలిత మిక్లే యుండును.

# గజకూర్మములు

"అన్నదమ్ము లక్రమముగా గజకచ్ఛపజన్మ మెత్తిరి. ఆకూర్మ మీప్రాంతమున నున్న సరోవరమున నున్నది. ఆగ జమును వనమున సంచరించుచు కూర్మమున్న సరోవరమున నీరుద్రాగుటకై వచ్చుచుండును. ఆగజ మాకూర్మ మక్కడ నున్న దని పసికట్టి కోపముతో ఘీంకారము చేయును. దాని

ఘీంకారమున నది గ్రహించి గజము నీటిలో దిగునప్పటికి దానికాళ్ళుఁ దొండముఁ బట్టి లాగి చంపఁబోవును. గజము తనతొండముతో దానినిఁ బట్టఁబోవును. అదియు విజృంభించి నీటిలోనికిఁ బోయి మరల గజముపైఁ బడఁజూచును. ప్రతిదిన మును వానికిఁ బోరాటము తప్పదయ్యె. వానిని బూర్వజన్మ శత్రుత్వము విడువలేదు. అది వింతగాఁ గనఁబడ దివ్యదృష్టి తోఁ జూచితిని. వాని పూర్వజన్మవృత్తాంతము తెలిసికొంటిని. అవి రోషపూరితములయి పోరాడునపు డొక్కపెట్టున రెంటి నిఁగొట్టి చంపి భక్షింపుము. ఒక్కదానిని ముందు హింసించితి వేని రెండవదానికి రోషము తగ్గిపోవును. ఇతరునిచేఁ జంపఁ బడుటచే రెండవదానికి నిరుత్సాహముగలిగి చలము దిగిపో వును. వాని నాహారముగాఁ గొంటివేని చలము బలమును, పౌరుషముఁ బరభయకరత్వమును గలుగును. నీయభీష్టము నెఱవేర్చుకొనుము. తల్లిదాస్యము విడిపింపఁగల తనయుఁడవు గలిగినందులకు నేనును ధన్యుఁడను. నీకు సమయోచిత ముగా సర్వభూతశక్తులు వశములగుఁగాత. నీవు కామరూ పివి. కావలసిన రూపము ధరించి కావలసిన పనులు సాధించు కొనుము." అని యాశీర్వాదముచేసి పంప నతఁడాగజకూర్మము లుండుసరోవరమున కరిగి వానిపోరాటమును, చలమును బల మును జూచి వింతపడి తండ్రిచెప్పినరీతి నొక్కదెబ్బ గొట్టి రెంటిని నొక్కమాఱే కాలిగోళ్లతోఁ బట్టుకొని పైకెగిరి

యెక్కుడనయునఁ బెట్టుకొని తినవలయు ననిఁ తగినతావునకై చూచుచుండ, అలంబనును తీర్థమున మహావృక్షసంకుల మగు నరణ్యమధ్యమున మహావృక్ష మొకటి వాని గంటఁ బడెను. దానికొమ్మలు రెమ్మలు "రమ్మ రమ్మ" అని పిలుచుచున్నట్లు లల్లలాడుచుండె. అది గరుత్మంతుఁడు చూచి దానిమహాశాఖపైని వ్రాలునంతనే యది పెళపెళ మని విఱిఁగెను. ఆశాఖ కడుగుభాగమున వాలఖిల్యాది మహర్షులు తల క్రిందుగా గబ్బిలములవలె నంటిపట్టుకొని తపముచేయుచుం డిరి. అది గరుత్మంతుఁడు చూచి యాకొమ్మక్రిందఁ బడినచో నామునులు నలఁగిచత్తురు. ఆచెట్టుక్రింద నున్న జనులు, జంతువులును మృతిచెందు నని యెంచి కొమ్మక్రిందఁ బడకుం డఁగ నోటఁ గఱచిపట్టికొని పైకెగిరెను. ముక్కుతో మునులు వ్రేలాడుచున్న మహాశాఖను గోళ్లతో మహాదేహములగు గజకూర్మములను బట్టుకొని ఱెక్కలు నిక్కఁబట్టియున్న వాని రూపము లోకముల కన్నిటికి మహాద్భుతభయంబులు గలిగించుచుండెను. గరుత్మంతుఁ డేమి చేయుటకును పాలుపోక తన తండ్రియగు కశ్యపుని సన్నిధి కరిగెను. కశ్యపుఁ డతనిఁ జూచి యద్భుతపడి యాకొమ్మ నంటిపట్టుకొని యున్న వాలఖిల్యాది మహర్షులను జూచి "మహర్షులారా! మీర లావృక్షశాఖను విడిచి రండు. హిమాలయమునఁ దపమాచరింపుఁడు. మీ కపాయము గలుగునేమో యని గరుత్మంతుఁ డాకొమ్మను

నోటం గఱచిపట్టుకొని యున్నవాఁడు. వినాయనుగ్రహము
ననే పనిక్కిశక్తి గలిగినది. మాతృదాస్యవిమోచనమునకునై
మహేంద్రు నోడించి యమృతకలశము దీసికొనిపోఁ బోవుచు
న్నవాఁడు. వాని ననుగ్రహింపఁ దన ఋషులు వృక్షశాఖ
విడిచి క్రింది కుఱికిరి. గరుత్మంతుఁడు తననోట శాఖ యుండు
టచే, నస్పష్టముగాఁ దనతండ్రితో “జనకా! యీమహా
శాఖ నెక్కడ విడుతును? జనసంచారము గలప్రదేశమునఁ
బడవైచితినేని జనుల కపాయము వాటిల్లును. నిర్జనప్రదేశ
మెందైన నున్నచో వచింపుము.” అని ప్రార్థింపఁ గశ్యపుఁడు
“కుమారా! హిమవంతమున కావలిభాగమున నిర్జనారణ్యము
గలదు. అందు విడుపుము” అని సతిఁ డత్లుచేసెను. అనంత
రము హిమవత్పర్వతశిఖరముమీఁద వ్రాలి గజకచ్ఛపముల
భక్షించి ప్రబలము లగు బలోత్సాహములతో స్వర్గమున
కరుగ సమకట్టి ఱెక్కలు విదుల్చుకొని బయలుదేఱెను.

ఆవృక్షశాఖ హిమవత్పర్వతభాగమునఁ బడినపుడు గలి
గిన యదటునకు లోకము లన్నియుఁ గంప మొందినవి. కొన్ని
పర్వతశిఖరములు విఱిగినవి. ఆమహాధ్వనికి దేవతావర్గ మం
తయు దిగులునొందెను. దేవతానాథుఁ డిది యేమి యని
దీనాననుఁ డయి చూచుచుండ నాతనిచేతివజ్రాయుధము దిగ
జాఱెను. వానిభటు లందఱును భయమునఁ గొయ్యవాఱి
వారియాయుధములు స్వయముగానే జాఱి పడిపోయినవి.

మేఘము లాధ్వనికి గర్భనిర్భేదమొంది రక్తవర్షము కురిసెను. “ఏమి యిట్టి యుత్పాతము లుప్పతిల్లుచున్న” వని మహేంద్రుఁడు మంత్రియుఁ బురోహితుఁడు నగు బృహస్పతి నడుగ నతఁడు మహేంద్రునితో నిట్లనియెను.

“మహేంద్రా! కశ్యపునకు వినతయందుఁ గలిగిన గరుత్మంతుఁడు మనయమృతకలశము గొనిపోవ వచ్చుచున్న వాఁడఁట. అతఁడు వచ్చుచు నొకవృక్షశాఖపై వ్రాలిన నది విఱిగెనఁట. అది క్రిందఁబడినచో దానినంటి తపముచేయు వాలఖిల్యాదుల కపాయము వాటిల్లునని తండ్రి యొద్దకుఁ గొనిపోయి కశ్యపప్రార్థనమున వాలఖిల్యాదులదివిడిచిపోవ నాకొమ్మను హిమాలయమునఁ బడవైచెనఁట. దానివలనఁ గలిగిన మహాధ్వని యిది. కశ్యపునిపుత్రికామేష్టికాలమున నీవు చేసిన ఋషిపరిహాసమున కిది ఫలము. లేకున్నచో నెవఁ డమృతకలశము గొనిపోవ యత్నింపఁగలఁడు? స్వయంకృతాపరాధఫల మనుభవింపవలసియున్నది.” అన మహేంద్రుఁ డాపూర్వవృత్తము జ్ఞప్తికిఁ దెచ్చుకొని దానఁ గలిగిన యధైర్యము నణఁచికొని “ధైర్యము తెచ్చుకొని శక్తివంచన లేకుండఁగ సంరక్షణ గావించుకొనుట విధి, తర్వాత నెట్లు గావలసియున్నదో యట్లు గాక తప్పదా” యని యెంచి యమృతకలశరక్షకుల జాగరూకతతో నుండఁ బురికొల్పి యక్షకిన్నరకింపురుషగంధర్వాది దేవతాజాతులవారల నెల్లర రావించి “దేవతలారా!

మీరు మీమీజాతిభేదములు విడిచి యైకమత్యము సంపాదించి యమృతకలశము రక్షించుకొనవలసిన సమయము వచ్చినది. గరుత్మంతుఁడు మన యమృతకలశము దీసికొనిపోవ వచ్చుచున్నాఁడట. అతఁడు పక్షిమాత్రుఁడయినను గారణాంతరమున బలవంతుఁడయ్యె. మీమీ శస్త్రాస్త్రములు ధరించి యమృతకలశము రక్షింపుఁడు. ప్రభుధర్మమునఁ జెప్పుచున్నవాఁడ ననుకొనకుఁడు. మీ రందఱును నన్ను రాజుగా నేర్పఱచిన నేను రాజనయితిని. రాజనఁ బ్రజలకు సేవకుఁ డని నే నెఱుఁగుదును. మీ సాహాయ్యము లేకున్న నే నేమి సేయఁగలను. అమృతాహారుల మగు మన కమృతకలశము పోయిన నాహారము లేక పోవును. పరులది యాస్వాదించి రేని వారుమరణశూన్యులయి మనల బాధింపవత్తురు. అని చెప్ప నందఱును శస్త్రధారులయి యుద్ధసన్నద్ధులయి యుండిరి. గరుత్మంతుని ఱెక్కల చలనమునఁ గలుగు గాలిచే ధూళి రేఁగి స్వర్గమందంతటను గ్రమ్మెను.

# అమృతకలశము

గరుత్మంతుఁడు తిన్నగా నమృతకలశ ముండుచోటి కరుగుచుండఁ గొందఱు మొదట నెదిరింపఁజూచిరిగాని వారు భయమున నిశ్చేష్టులయి నిలిచియుండిరి. అమృతకలశగృహ రక్షకులలో ముఖ్యుఁడగు భౌమనుఁడు కొంతసేనతో గరుత్మంతు నెదిరించి బాణములేసియు ఖడ్గములఁ బొడిచియు నిరోధింప గరుత్మంతుఁడు కోపోద్రేకమొంది చెలరేఁగి గోళ్ళతో గీఱియు ముక్కుతో ముక్కముక్కలు గావించియుఁ గొందఱఁ బడఁగొట్టెను. కడమవారు కోపమున గరుత్మంతునిపయి శస్త్రాస్త్రములు ప్రయోగింప నతఁడు విజృంభించి ఱెక్కలు గట్టిగ విదుల్చుకొనుచు మండలాకారముగ గిఱ్ఱునఁ దిరిగెను. దాని మూలమున ధూళిరేఁగి దేవతాగణముల కన్నులఁ గ్రమ్మగా అందఱు నంధప్రాయు లయిరి.

అంతలో నింద్రుని ప్రేరణమున వాయుదేవత తనబలమును జూపి యచటి ధూళి నెగురఁగొట్టెను. దేవతలు మఱియొకమాఱు చెలరేఁగిరి గాని గరుత్మంతుని నఖపక్షతుండఘాతుల కాఁగలేక పడిపోవ నతఁ డప్రహతముగా నమృతకలశగృహమున కరిగెను.

అతఁ డమృతకలశగృహమునకుఁ జుట్టును మహాగ్ని జ్వాలామాలలు తోరణములు గట్టినట్లు వెలుగు నగ్నిదుర్గము

చూచి యందుఁ బ్రవేశించినఁ దనతనువు దగ్ధమగునని భయ
పడి యందుఁ జొరనేరక వెనుకకు సరలి కామరూపుఁడు
గాన ననేకసహస్రముఖములుగల రూపమొంది నదీనదజలం
బులఁ బుక్కిటఁబట్టి తెచ్చి యాయగ్నిజ్వాలలపైఁ జల్లి య
గ్నిని జల్లార్చి యనాయాసముగా నాయగ్నిదుర్గము దాఁటి
కలశసమీపమున కరిగిన నందు గిరగిరం దిరుగు మహాచక్ర
మొకటి వానికిగనఁబడెను. దానియారములుక్షురికాగ్రములవలె
మహాతీక్ష్ణములయి దుష్ప్రవేశము లయి యుండుటఁ జూచి,
యతిసూక్ష్మరూపము ధరించి యాయారములనడుమఁ జొచ్చి
లోపలఁ బ్రవేశించి యావైపునఁ జక్రమునకు వాఁడియార
ములు లేకుండుటం జేసి దానిఁ బడఁగొట్టి యమృతకలశము
గ్రహింపఁబోయెను. అందు మహాక్రూరమగు సర్పయుగళము
వానికి దృష్టిగోచరమయ్యె. అవి పడగలు విప్పి యాడుచు
విషజ్వాలలు గ్రక్కుచు నుండెను. వానిదృష్టిపథమునఁ బడిన
వాఁ డెవఁడయినను భస్మము గావలసినదే. వానిభయంకర
రూపము చూచి గరుత్మంతుఁ డెకట నిలువవెఱచి పైకెగిరి
రెక్కలగాలితోఁ ధూళిరేఁగఁగొట్టిన నాకుమ్ముపడి యాసర్ప
ములకన్నులంధములయ్యె. అంత గరుఁడుడు వానితలపైఁ
దన్ని పడగలు నలగఁగొట్టి తుండహతినిఁ దుండెతుండెములు
గావించి వానిఁ జంపి, ఆయమృతకలశము గొని చరితార్థుండ
నయితి ననుకొని సంతోషోత్సాహములతో నాకసమున కెగిరి

పోవుచుండ దేవతలు ఖిన్నులయిచూచుచుండిరి. గరుత్మంతుఁ
డప్రతిహతముగఁ బోవుచుండ మార్గమధ్యమున మహావిష్ణువు
వానిదర్శనపథమునఁ బడెను. గరుత్మంతుఁ డతనిఁ జూచి
నమ్రతతో నమస్కరించి స్తుతింప సంతుష్టుఁడయిన విష్ణువు
"గరుడా! అంతశ్రమమున సంపాదించిన యమృతము నా
స్వాదింపనయిన నాస్వాదింపక తీసికొనిపోవుచున్నావు. అమృ
తము జరామరణహరమగు రసాయన మని యెఱుఁగవా?
ఏమి నీ నిరపేక్ష. అమృతము లభించిన నట్లూరకుండువారు
లోకమున నుందురా?

గరు—దేవదేవా! అమృతమహిమ మెఱుఁగనివాఁ
డను గాను. పరమేశ్వరుండవగు నీయనుగ్రహమున జరా
మరణభయము లేకుండవలయును. రసాయనసేవవలన జరా
మరణముల నివారింపనొల్లను. స్వతస్సిద్ధమగు బలమే బలము
గాని రసాయనసేవాలబ్ధ మగు బలము బలముగాదు. అది
కృత్రిమముగదా! దేవా! అదిగాక అమృతము గొనిపోవుట
మాతృదాస్యవిముక్తికిఁగాని మదుపయోగార్థముగాదు. పురు
షోత్తమా! పూర్ణానుగ్రహ ముంచుము. మామాతను దా
స్యమునుండి విడిపింప విలంబమగుచున్నది. సెలవుపుచ్చు
కొని పోయివచ్చెదను.

విష్ణు—ఓయీ! నీధైర్యస్థైర్యములకు మెచ్చితిని. నీవం
టివాఁడు చిరంజీవివై యుండుట లోకమునకుహితము. ధైర్య

స్థైర్యములు లేనివారు జీవించిన నేమి? మరణించిన నేమి? నీయుదారత నీస్వాతంత్ర్యవాంఛ, నీపరానపేక్ష నీస్వయం సహాయశక్తి చూచిన సంతోషమయ్యె. నీవు తలంచినట్లు అమృత రసాయనసేవ లేకుండగనే నీవు జరామరణ శూన్యుఁడవయి యుందువు నీగుణవిశేషములకు సంతసించితిని. ఏదైన వరమొకటి కోరుకొనుము. నీకిచ్చెదను.

గరు—దేవదేవా! నీసేవతప్ప నాకుఁ గావలసిన దేమున్నది? సర్వదా నీసన్నిధి నుండునట్లు నాకువరమిమ్ము.

విష్ణు—నిష్కల్మషహృదయుల సాన్నిధ్యము నేనెప్పుడును గోరుచుందును. అది యొక వర మనుకొన నక్కఱ లేదు. అది నాయభీష్టము నెఱవేర్చుకొనుటయే. నీవు నాకు ధ్వజమవయి యుందువు. గరుడధ్వజుఁడ నగుట నా కెంతయో సంతసము. నా కెంతయో గౌరవము. నీవేదియైన నొకకోరిక కోరుకొనుము.

గరు—దేవదేవా! పుట్టినది మొదలు ఎఱిఁగియో యెఱుఁగకయో దాస్యము చేసితిని. కుటిలగాములగు కద్రూపుత్రులఁ మోచిమోచి దూషితముఖులస్పర్శమున నపవిత్రమగు నావీఁపు భవత్పాదపద్మస్పర్శమునఁ బవిత్రము చేయుము. నీకు వాహనముగా నుండ ననుగ్రహింపుము. అది యిదే నా కోరిక. నిన్నుఁదక్క నన్యుల నాశ్రయింపనొల్లను.

విష్ణు—అట్లే యగుఁగాక. నాకావశ్యక మగునపుడెల్ల

నిన్ను స్మరింతును. అది నీహృదయమునకుఁ బొడకట్టును. అప్పుడు వచ్చి నాకు వాహన మగుచుందుము.''

గరు—దేవదేవా! మహాప్రసాదము. మామాత దాస్యమున నున్నది. విలంబము చేయనొల్లను. సెలవు దయచేయుము పోయివచ్చెదను. సంపూర్ణానుగ్రహముతో సమయమున నన్ను స్మరించి నాపేరు పవిత్రము చేయుము." అని విష్ణుయొద్ద సెలవుగయికొని గరుత్మంతుఁడు బయలుదేఱునంతలో వానివెంట నెంతవేగముగానో పరువెత్తుకొని వచ్చుచు వానిఁ గలిసికొనలేక వెనకఁబడిన మహేంద్రుఁ డెట్లో వాని సమీపమునకు వచ్చి వజ్రాయుధము బ్రయోగింప నది గరుత్మంతునివెనుక బుఱ్ఱు మని ధ్వనిచేయుచుఁ బోవుచుండెను గాని వానిఁ దాఁకుటకు సాహసింపదయ్యె. అతఁ డాధ్వని విని యేమిది యని వెనుకకుఁ దిరిగిచూచి చిఱునగవు నవ్వి "ఓవజ్రమా! మహేంద్రుఁడు తుదకు మాట దక్కించుకొనలేకపోయినాఁడా? నిన్నుఁ బ్రయోగించినాఁడా? కానిమ్ము. నీవు త్రిలోకసామ్రాజ్యాధిపతి చేతిలోనిదానవు. మహాప్రసిద్ధి గలదానవు. నిన్నవమానపఱచుట నాకిష్టము లేదు. నిన్నుఁ బ్రయోగించినమహేంద్రు నవమానపఱచుటయు నా కిష్టము కాదు. నీవు నన్నేమియును జేయఁజాలవు. వచ్చినందులకు వ్యర్థముగాఁ బోక నారెక్కయొక్క తుదముక్క కొంచెము ఖండించిపొమ్ము. అంతకు మించినపని చేయఁగలిగినఁ జే

యును. నాకు సత్కృతమే.” అన వజ్రము వానిపయిఁబడి వాని
ఱెక్కలు ఖండింప నుద్యమించి తుద కేమియును జేయఁజా
లక గరుత్మంతునిసమ్మతిని నాతనిపక్షరోమాగ్రము ద్రెంపి
మరలి యింద్రునిఁ జేరెను. సకలలోకముల వారును వానిప
క్షములకట్టితనమును జూచి యాశ్చర్యపడి వానికి సుపర్ణుఁ
డని పేరుపెట్టిరి.

మహేంద్రుఁడు వాని జవసత్త్వసామర్థ్యములకు మెచ్చు
కొని వాలఖిల్యాదులతపోమహిమ జ్ఞప్తికిఁ దెచ్చుకొని యప్పు
డుకశ్యపుఁడు చెప్పినసదోపథము స్మృతికి రాఁగా గరుత్మం
తునితో సఖ్యముచేసికొనుట యుక్తమని తలఁచి వానిదరికిఁ
బరువెత్తికొనివచ్చి “కశ్యపకుమారా! వైనతేయా! మన
మిరువురము భ్రాతలమే. నీకు నే నగ్రజుఁడను సఖ్యముగోరి
వచ్చితిని. సాధువిధానము చూపఁగోరితిని. వజ్రము ప్రయో
గించితినని మనమునఁ గోపముంచక భాతృభావమున నీమైత్రి
నాకిమ్ము.

గరు—మహేంద్రా! నీవు త్రిలోకాధినాథుఁడవు.
నీవే సఖ్యమున కంగీకరించినపుడు ననుబోఁటివాఁడు నిరాక
రించునా? మన మెన్నఁడును విరోధమునొందక మైత్రితో
మెలఁగుదము. నామనమునఁ గోపమున్న దనుకొనకుము.
సందేహింపక నాసాహాయ్యము నీకుఁ గావలసినఁ దెలుపుము.

మహేం.—నీవు దేవదేవుని యనుగ్రహమున నే, జరామరణశూన్యుఁడ వయితి వని వింటిని. నీ కమృతకలశ మెందుకు? అది పరులకి చ్చితి వేని హారాస్వాదించి జరామరణశూన్యులయి సాధుబాధ గావింతురు. నాయందు సఖ్యముంచితి వేని యీయమృతకలశము నాకిమ్ము. అదియే యమరుల కాయుప్రపట్టు.

గరు.—మహేంద్రా! మామాత వినత కద్రూదాస్యమున నున్నది. ఈయమృతకలశము కాద్రవేయుల కిచ్చినచో మాదాస్యముకు విముక్తి యగును. నేనమృతకలశము వారికిఁ దెచ్చి యిత్తు నని ప్రతినఁబూని వచ్చితిని. లేకున్న నిష్కారణము మీకు బాధగలిగింతునా? నే నిది నాగుల కీయకతప్పదు. నేను వారి కిచ్చి మాతల్లిని దాస్యవిముక్తురాలను గావించితీసికొనిపోయెదరు. వారమృతము త్రాఁగకుండ నీకుండ నీవు దీసికొనిపోవు నుపాయము చూచుకొనుము. వారు వంచనచే మమ్ముంత బాధ బెట్టిరి. వారిని వంచించువా రుండుట యరుదా? వంచకులను వంచించుట దోషములోనిది గాదు. నీ వాలోచించుకొనుము. నేను శీఘ్రముగఁ బోవలయును.

మహేం.—అనుజా! మంచిది. అదియే తగినయుపాయము. నీజవసత్వసామర్థ్యము లసాధారణములు. వానివిశేషములు వినఁదలఁతు వచింపుము.

గరు.—పరదోషకథన మెంత నింద్యమో ఆత్మగుణకథన

ముగూడ నంతనిందిత్యమే యందురు. త్రిలోకాధినాథుండ వగు నీ వడిగినపుడు చెప్పకతప్పదు.

మ—లేనిగుణములు చెప్పి యాత్మస్తవముచేసికొనుట తప్పుగాని యథార్థగుణములు దెలుపుట తప్పుగాదు. విశేషకుతూహలము గలిగి యడిగితిని చెప్పుము.

గరు—మూండునిమిషములలో ముల్లోకములును దిరిగి రాఁగలను. జంగమస్థావరాత్మక మగు ప్రపంచమంతయును వీఁపున ననాయాసముగా ధరింపఁగలను. రెండు రెక్కలు నొక్కమారు ఆడించితినేని సముద్రములందలి జలమంతయు బిందుమాత్రమునఁ బైకెగసి సముద్రాధోభాగము నీటిచుక్కయైన లేక యెండిపోవలసినదే. నాకంతపని చేయవలసినపని యేమున్నది. పెద్దలయాశీర్వచనబలమునఁ గలిగినబల మట్టిది.

మ—అనఘా! నీవు చెప్పిన దంతయును సత్యమే. నీజనసత్వసామర్థ్యములను మెచ్చుకొంటిని. నీ కిష్టమైన నొక వర మీయఁదలఁచితిని, కోరుకొనుము. ఒకరియభీష్టము లొకరు దీర్చుకొనుటయేగదా మైత్రీఫలితము. నామాటచెల్లించి యొకవరము కోరుము.

గరు—ఏమి కోరను. నాకుఁ గావలసిన దేమున్నది? అయినను చిత్తగింపుము. కద్రూకాద్రవేయులు మాతల్లిని మోసపుచ్చి యామెచేతను నాచేతను దాస్యముచేయించుకొనినారు. నను వారపయిని పగదీఱలేదు. నేనాకోపమున

మున్న వారిజాతినంతయు నశింపఁజేయఁదలఁచితిని గాని మా మాత యుపదేశించినరీతిని శాంతమార్గమునఁ గార్యము లేకుండఁగ వారికోరిక దీర్చి దాస్యవిముక్తి గావించికొన నిశ్చయించితిని. అది యొకక్షణములోఁ బూర్తి యగును. అపయిని వారిజాతి నంతయు నాకాహారముగాఁ జేసికొనఁదలఁచితిని. అప్పుడుగాని నాకసి దీఱదు. క్రమముగా నాగకులాంకురము లేకుండఁగఁ జేసెదను. అందఱు నొక్కుమ్మాఱుగఁ జంపినయెడలఁ గోపము దీఱదు. కావున వారిని నాకుఁ బ్రతిదినాహారముగాఁ జేసికొందును. అందులకు సమ్మతింపుము. కార్యము నేనే సాధించుకొందును. నీవు త్రిలోకసామ్రాజ్యాధిపతివి గావున నీయనుమతి గోరితిని. అది నాకనుగ్రహింపుము.

## దాస్యవిమోచనము

మ—వైనతేయా! నీవు దలఁచినదాని కడ్డేముండును? అట్లే కానిమ్ము. పన్నగాశనుండ వగుము. ఆవంచకుల కది తగినశిక్షయే. కుటిలవర్తనులును, విషముఖులును నగువారి నణఁచుట యొల్లని నేనే చూచుచున్నాను.

గరు—మహేంద్రా! మనమాటలతో విలంబ మగుచున్నది. మాత యచట దాస్యము చేయుచుండును. పోయెద, సెలవిమ్ము. ఈయమృతకలశ మొకచోఁ బెట్టి వారికిఁ జూపి వారియనుమతిని మాయమ్మను వీఁపుపయి నెక్కించుకొనిపోయెదను. నీ త్రోవ నీవు చూచుకొనుము. అని చెప్పి గరుత్మంతుఁడు వేగమునఁ బోయి వానికై యెదురుచూచుచున్న తల్లియుఁ గాద్రవేయులను సంతసింప నమృతకలశము వారికిఁ జూపి వారియనుమతినిఁ గుశాస్తరణమున నదియుంచి “సూర్యచంద్రులు సాక్షులుగా మీ కమృతకలశ మిచ్చితి” నని ధ్రువముగాఁ జెప్పి కద్రూకద్రూపుత్త్రులచే “మీరు దాస్యవిముక్తుల రయితిరి” అని యనిపించుకొని యాతని మాతను వీఁపుపయి నెక్కించుకొని తనతండ్రిదర్శనమునకు వెడలెను. వినతయానందమునకు మేర యే లేదు. వియన్మార్గమునఁ బోవువారిని విష్ణువును దేవతాబృందమును నభినందించి దాస్యవిమోచనసమర్థుఁడగు గరుత్మంతుని వేయివిధములఁ బొగడిరి. “సత్యమేవ జయతి” అనువాక్యము సత్యమే యగును గాని యసత్యమగునా? మాతృదాస్యవిముక్తి గావించిన యాధన్యాత్మునిఁ దలఁచిన నెవరు ధన్యాత్ములు గారు. అట్టిధన్యాత్మునిఁ గన్న తల్లిదండ్రు లెంతధన్యులో. అని యనుకొనిరి.

అనూరుఁడు సూర్యసారథిగా నుండి యంతయుఁ జూచి మహానంద మొందుచుండెను. తాను మాతృదాస్యవిమోచ

నమునకుఁ దోడ్పడలేకపోయితి నని విచారించెను. కశ్యపుఁడు తనభార్యను కుమారునిఁ జూచి సంతసించి ధన్యాత్ములమయి తిమని యనుకొనెను.

కాద్రవేయు లాయమృతకలశము చూచి గరుత్మంతుని సామర్థ్యమును పొగడి తమ కెన్నఁటికి జరామరణములు లేకుండఁజేయుసాధనము దొరకిన దనుమహోత్సాహముతో నోడ లెఱుంగక పడగలు విప్పి యాడిరి. కద్రువకు దుర్లభమగు నమృతము దొరకిన దని సంతోషమున్నను సపత్నీసపత్నీపుత్త్రులను దాస్యమునుండి విడిచిపెట్టవలసివచ్చినందులకు విచార మొందుచుండెను. వినతను వీఁపుమీఁద నెక్కించుకొని గరుత్మంతుఁడు స్వేచ్ఛగా నాకసమంట నెగిరినపుడు కద్రువకన్నులలోఁ గారముకొట్టినట్టే యున్నది. మోసమెంత కాలము జరుగును. అది బయలుపడక మానునా?

కాద్రవేయు లమృతాస్వాదము గావింపకముందు స్నానము గావింపఁదలఁచి గంగ కరిగిరి. వారుత్సాహాతిశయమున జలక్రీడసేయుచు విలంబము చేసిరి. కద్రువయుఁ గొడుకుల నందఱను వెంటఁబెట్టుకొని రాఁదలఁచి వారి కుత్సాహభంగ మగునని వారిని దొందరపెట్టక వారియాటపాటలు చూచుచుండెను.

అంతలో గరుత్మంతుని వెనుక వచ్చియుఁ దిరస్కరిణీ

విద్యచేఁ బరులకుఁ గనఁబడకుండ నమృతకలశము గొనిపోవ వచ్చిన మహేంద్రుఁడు కుశాస్తరణముమీఁద నున్నయమృత కలశము చేతఁ బట్టుకొనిపోయెను.

కద్రూకద్రూపుత్రు లధికోత్సాహముతో నమృతాహారము గొనవచ్చి యమృతకలశము గానక మోసపోతిమి మోసపోతిమి అని మొఱపెట్టిరి. వైనతేయుఁడు మాయచేసి యుండునా యని కద్రువ సందేహించెను గాని కాద్రవేయు లంతమాట యనరా దని యూరకుండిరి. మహేంద్రుఁ డాతని నేమియుఁ జేయఁజాలక యాతఁ డిక్కడఁ బెట్టి వెడలినతర్వాతఁ గొనిపోయెనేమో యని వా రూహించిరి. మహేంద్రుఁ డమృతకలశమును దొందరగాఁ గొనిపోవునపుడు కొంచెమమృతము తొనఁకి యాకుశలపయిని పడ నది నాగులు నాకిరి. ఆదర్భలగఱుకుఁదనమున వారిజిహ్వలు రెండుచీలికలయ్యె. అందఱును హతాశులయిరి. మహేంద్రుఁడే పట్టుకొనిపోయి యుండునని వారికిఁ దోఁచెను. వాని నేమిచేయఁగలరు. సూర్యకిరణతాపతప్తులయినపుడు వానియనుగ్రహమువననే మరల బ్రతికినారు. తుదకుఁ జేయున దేమియును లేక వినతను వంచించిన పాపము వ్యర్థముగాఁ బోవునా? సర్వవిధములను వంచితుల మయితిమి. మఱి యింకను ఏమియాపద రానున్నదో యని వారిలో వారే దుఃఖించుచుండిరి. అంత గరుత్మంతుఁడు మహేంద్రునివలనఁ బన్నగాశనుఁ డగు

నట్లు వరము పుచ్చుకొన నని కర్ణాకర్ణిగా విని కర్తవ్య మేమి యును దెలియక భయపడుచు నుండిరి. తల్లితిట్టినతిట్లు కిది ఫలమేమో యని వారిలోఁ గొంద అనుకొనిరి.

# కసిదీర్చుకొనుట

గరుత్మంతుఁడు తల్లిని దనతండ్రియాశ్రమమున దిగఁ బెట్టి తలిదండ్రులతో ,, జనకులారా ! నేను స్వేచ్ఛగా సంచ రింప నాకనుజ్ఞయిందు. శ్రీవిష్ణువునకు వాహనముగానుండుదును. నా కానాగులపయిని కసితీఱలేదు. తల్లిమాట దాఁటరా దని దాస్యము వాపుకొన నమృతకలశము తెచ్చి యిచ్చితిని గాని నామనమునఁ గోపాగ్ని మండిపోవుచున్నది. దాని కాకాద్రి వేయుల నాహుతిగా వేయవలయును. తప్పదు. అప్పుడు గాని నాకోపాగ్ని శాంతింపదు.

వినత—కుమారా ! వా రమృతాస్వాదము చేసియుం దురుగదా. వారి నెట్లు సంహరింపఁగలవు.

గరు—వారిని వంచించి మహేంద్రుఁ డది యప్పుడే కట్టుకొనిపోయి యుండును. వారల కమృత మిచ్చిన నుడా

ని నుపయోగించుకొనఁగలరా? ఇంద్రుఁడు కాచియే యున్న వాఁడు. మహేంద్రుువలనఁ బన్నగాశనత్వము వరముగాఁ గొంటిని. ఇఁక నది తప్పదు. వారల నందఱను నాపొట్టను బెట్టుకొనవలెను. నాకోపము కొంచెమయినఁ దీఱవలెను. చచ్చినవాండ్రు చచ్చుచుండఁగా బ్రతికినవాండ్రు భయమునఁ జచ్చుచు మనలఁ బెట్టినబాధలకుఁ బశ్చాత్తాపపడుచు బాధ పడవలయును." అని చెప్పి జనకులసెలవు గయికొని యుత్సాహమున ఱెక్కలు గట్టిగ నాడింపఁబోయి లోకములకు బాధ కలుగునేమో యని విజృంభింపక నాగులున్న ప్రదేశమున కరిగి యొక్కమాఱు విజృంభించె.

అంతకుముందే గరుడుఁడు పన్నగాశనత్వవరము పొందినవాఁ డని యడలి నాగులు చచ్చుచున్నారుగదా. అదియె సిద్ధమయిన దని చావు స్థిరముచేసికొని హతాశులయి యందఱును నిరాధారు లయియుండిరి. పాపము! పిల్లలు, స్త్రీలు, వృద్ధులు, గర్భిణులుఁగూడ హడలిపోవుచుండిరి. గరుత్మంతుఁడు గ్రహముతో ఱెక్కలు విప్పి మండలాకారముగఁ దిరిగి తనకుఁ గావలసినవారిని బట్టి కాలిక్రిందఁ ద్రొక్కిపట్టి ముక్కుతో లాగి చీల్చి వ్రేవులు బ్రద్దలు చేసి కసిదీఱ రక్తమాంసములు గొనుచు వారివారల వైపు చూచుచుండెను.

ఆకలి కాహారమయి చచ్చినవారికంటె నాతనియాగ

మనభయమునఁ జచ్చినవా రధిక మగుచుండిరి. గర్భిణులు
గర్భనిర్భేద మయి చచ్చుచుండెడివారు. కోప మున్న నుండ
వచ్చును. కోపపాత్రులను జంపుకొని తినవచ్చును గాని నిరప
రాధులును నిరాధారులు నగు గర్భిణులను వృద్ధులను పిల్లలను
జంపుట యుక్తము గాదని గరుత్మంతుఁడుమాత్ర మెఱుఁగఁ
డా. ఎఱుఁగును. కక్ష యట్లు చేయించును. శత్రుసంహారము,
కసిదీర్చుకొనుట అనునవి తప్ప వేఱొకటి తోఁపనీయదు. వా
నికి దయ లేదు. దాక్షిణ్యము లేదు. హింస యొకటే. అంతయుదా
రునకు, సర్వలోకగౌరవార్హునకు, విష్ణువాహనునకు, మహేంద్ర
మిత్రునకు కశ్యపబ్రహ్మపుత్త్రునకు, వినతాకుమారునకు
ఇంతనిర్దయ, ఇంతహింసాసక్తి, ఇంతక్రౌర్యము ఎట్లు కలిగె
నని యాశ్చర్యము గలుగకమానదు. కానిజంతువులపచ్చిమాం
సము భక్షించువారికిఁ గరుణ గలుగునా ? మాంసాహారులకు
తినుటకు వారిదేవతల కర్పించుటకు నన్నిటికిని జంతుహింస
యే. అన్నిటికిని జంతుబలులే. అప్పుడు జగత్తు హింసా
బహుళమయి సర్వజీవబాధ కలుగుచుండును.

నాగజాతివారికి నిజముగా నిమిషమయి జీవితమున
నమ్మకము లేదు. పాపము ! ఏమి చేయుదురు. ప్రతిదినమును
ఇట్లు నాగజాతియంతయు నశించుట చూచి నాగులలో రా
జగు శేషుఁడు సవినయముగా గరుత్మంతునితో “ మేము
స్వచర్యలకు వ్యతిరేకముగాఁ బలుకఁజాలము. మేము చేసిన

పాపము మే మనుభవించుచున్నాము. క్షమించి యొకమనవి విని నీకిష్టమయిన నది చెల్లింపుము. నీ విట్లు ప్రతిదినము నీ కాహారముగా నొకనినే భక్షించుచున్నావు. కాని నీయాగమ నభయమున నీపక్షవిక్షేపమున నెందఱో యడలి చచ్చిపోవు చున్నవారు. ఇట్లు గొంతకాలము జరిగినయెడల నాగవంశాంకురమే యుండదు. నీకును నాగాహారము దుర్లభమగును. కావున నీ విచ్చటికి వచ్చుట మానుము. ప్రతిదినమును నీ కాహారముగ నొకనిని మలయపర్వతప్రాంతమునకుఁ బంపు చుందును. అనాయాసముగ భక్షించి నీయాఁకలి దీర్చుకొను చుండుము. మ మ్మనుగ్రహింపు" మన నతఁ డప్పు డేదృష్టి నున్నవాఁడో కాని దాని కంగీకరించెను.

శేషుఁడు మలయపర్వతప్రాంతమున నొకవధ్యశిల గట్టించి వంతుగా నేర్పఱచిన నాగునికి వధ్యచిహ్నముగా నెఱ్ఱ బట్టలు కప్పి యాశిలపయిఁ బరుండఁబెట్టిన గరుత్మంతుఁడు వచ్చి భక్షించి పోవుచుండెను. వారి యస్థులరాసులు హిమ వత్పర్వతమును మించి యుండెను. ఆసిరవధిక మగు నాపద నాగులకు సంభవించెను. ఇతరలోకములవారిలోఁ గొందఱు వారి బలాత్కారమరణ నిర్బంధము విని యెంతయో విచారించుచుండిరి. మున్ను కద్రువయుఁ గద్రూపుత్రులును పెట్టిన బాధల కిది తగినదే యని కొందఱును ఈరీతిగా జరుగక పో యినచో ఈకుటిలవర్తనులకు, ఈవిషముఖులకు, ఈపరభ

యంకరులకుఁ జావు సంభవించునా? కద్రువ యీకష్టము లన్నియుఁ జూచి తాను చేసినమోసమునకు బుద్ధి తెచ్చికొన వలదా. అని కొందఱును అనుకొనిరి. కద్రువ మొదటఁ గొడుకులను దిట్టినతిట్లకు ఫలితమే యిది. దానిచేతనే గరుత్మంతున కట్టిబుద్ధి పుట్టినదని కొందఱు ననుకొనిరి.

ఆపద లెవ్వరికిని గాఁపుర ముండవు. ఏమహానుభావుఁ డో పుణ్యముకట్టుకొనును. గరుత్మంతు నెదిరించి వాని నిర్దయకృత్యములు మాన్పించువారు లేరే. వాని నెవరు మరలింపఁగలరు? ఎట్లు మరలింపఁగలరు? అని సందేహముమాత్రము తప్పదు. విరోధించి ఆతనిని మరలించువారు లేరు. మహేంద్రాదులే మాఱుసేయనేరక మైత్రి సంపాదించి తమ పనులు సాధించుకొనిరి. కానియంత నిర్దయాత్మునకును నటని మనములో దయగలిగించు మహానుభావుఁడు రావలయును. తనకు దయగలిగి యాతఁడే హింస మానవలెను. వానిబుద్ధి మాఱిపోవలెను. అప్పు డహింసాప్రధానుఁ డయి యందఱను సుఖస్థితికిఁ దేవలయును. అంతవఱకు నాగుల కాయాపద యనివార్యమే. చేసినపాపమునకు ఫల మనుభవింపవలదా. పాపక్షయ మయినఁ గాని ప్రతిక్రియ లభింపదు. అనుభవమునఁ గాని పాపక్షయము గాదు. వంచకులకుఁ దుదకుఁ గలుగు దురంత మిట్టిదే. ఏనాఁటికో వారికిని శుభదినములు లభింపక పోవు. "సుఖస్యానంతరం దుఃఖం, దుఃఖస్యానంతరం

సుఖమ్ ” సుఖముతర్వాత దుఃఖము దుఃఖముతర్వాత సుఖ
ము గలుగునందురు. అది సత్యము.

## ప్రాణదానము

నాగాధిపతి యేర్పఱచిన వంతుప్రకార మొకనాఁటి
వంతువాఁడయిన శంఖచూడుఁడు వధ్యచిహ్నముగు రక్తవ
స్త్రములు పట్టుకొని వధ్యశిలయొద్దకు వచ్చుచుండ వానితల్లి
భావిపుత్రవియోగదుఃఖమున నేడ్చుచు వానివెంట వెడలు
చుండెను. ఆమెయేడ్పు దయాశాలియొకఁడు విని జాలిపడి
వారిదరికి వచ్చి వారివృత్తాంతము తెలిసికొని గరుత్మంతుని
కరుణాహీనతకు విచారించి తనప్రాణము లిచ్చి శంఖచూడుని
ప్రాణములు రక్షించినచోఁ దనజన్మము ధన్యముగు నని యెంచి
శంఖచూడునితో “ నీబదులు నేను వధ్యశిలయెక్కి గరుడుని
కాహార మగుదును. ఆరక్తవస్త్రములు నా కి” మ్మని ప్రార్థింప
నతఁడు “ పరప్రాణరక్షణమునకై ప్రాణము లిచ్చెదవన్న
మహోదారుఁడవు. నీవు. నీవు బ్రతికియుంటే లోకమునకు

మహోపకారము జరుగును. నావంటి వా రెందఱో ప్రతిదిన మును బుట్టుచుఁ జచ్చుచు నుందురు. మా బ్రతుకువలన భూభారమే కాని లాభ మేమియును లేదు. నావంతు నేనే తీర్పవలయును. నీవారిని నీవు దయసేయుము " అని గరుత్మంతుఁడు వచ్చునంతలో నాప్రాంతముననున్న దేవాలయమునకుఁబోయి దేవదర్శనము చేసివచ్చుటకు వెడలెను.

ఆదయాశాలి తనకోరిక నెఱవేఱనందులకు విచారించుచుండఁగా నాతనియత్తవారు పెండ్లిపదియాఱవ నాఁటి పండుగ బహుమానముగాఁ బంపిన యెఱ్ఱపంచెలచాపు భటుఁ డొకఁడు పట్టుకొనివచ్చెను. అది సంతోషముతోఁ బుచ్చుకొని భటునిఁ బంపివేసి యాయెఱ్ఱపంచెలచాపు వధ్యచిహ్నముగా ధరించి వధ్యశిలయెక్కి పరప్రాణరక్షణమున నాజన్మము ధన్యమగునని యుత్సాహముతో గరుత్మంతుని రాకకై యెదురు చూచుచుండెను. గరుత్మంతుఁ డాఁకలిముఖమున ముక్కుతో వానివక్షమున నొక్కపోటుపొడిచి కాళ్లక్రిందఁ దొక్కిపట్టి ముక్కుతోఁజీల్చిరక్తమాంసములుసంతృప్తిగాఁబీల్చి యొకమాఱూరకుండిన, ఆధీరుఁడు " వైనతేయా! యేలయూరకుంటివి. ఇంకనురక్తమాంసము లున్నవి భుజింపుము. ఆఁకలి పూర్తిగాఁ దీర్చుకొనుము." అని రక్తమాంసములున్న తనదేహభాగములు వాని కందీయ నతఁడు ఆమహానుభావుని ధైర్యమున కాశ్చర్యపడి " మహాత్మా! నీవెవరవు ? నీవు సామాన్యుఁడవు కావు.

నాతప్పుక్షమింపుము." అన నతఁడు "నే నెవఁడనయిన నేమి? నీకు భక్ష్యముగా వచ్చితిని. పూరి గభక్షింపు" మన గరుత్మంతుఁడు తనజీవితమునందును, వృత్తియందును రోఁతనొంది "మహాత్మా! యీతుచ్ఛదేహమును బోషించుటకై ప్రతిదినము నొకనిఁ జంపి తినుచున్నాను. ఈతుచ్ఛదేహమునందున్న యభిమానమునఁ గద్రూకద్రూపుత్రులయందు బగవహించి కసిదీఱఁ బన్నగుల భక్షించుచున్నాను. నీవు నేఁటివంతుగా వచ్చిననాగునిరక్షింప నీదేహమర్పించినమహానుభావుఁడవని తలఁచెదను. లేకున్న నాగుల కింత రక్తమాంసము లెక్కడివి. ఇంతధైర్య మెక్కడిది" అనుచుండఁగా శంఖచూడుఁడు దేవాలయమునుండి వధ్యశిలదగ్గఱకు వచ్చి వారలఁజూచి "వైనతేయా! వానిని జంపకుము. నాదివంతు. ఆతఁడు విద్యాధరకుమారుఁడు. నాగజాతివాఁడు గాఁడు. నీకాభేదము తెలియదా" అని గట్టిగాఁ జెప్పుచు దగ్గఱకురాఁగా, వానివలన వృత్తాంతమంతయు విని పశ్చాత్తాపపడి తనవృత్తిని జీవితమును నిందించుకొనుచుఁ జేసినపాపమునకుఁ బరిహారమేమి? యని యాలోచించుకొని యామహానుభావునివలననే పాపపరిహారమార్గము తెలిసికొన నిట్లనియెను.

"మహాత్మా! మహాపాతకము చేసినాను. నేఁడు మొదలెన్నఁడును మాంసము ముట్టను. పరుల హింసింపను. ఫలాపేక్ష యేమియు లేక పరప్రాణరక్షణమునకై నీవు చేసిన

ప్రాణత్యాగమే నాకు గురు వయ్యెను. నీవు నాకు గురుడవు
గాననే జేసిన మహాపాతక పరిహారమునకై ప్రాయశ్చిత్త మేదేని
విధింపుము. ప్రాణత్యాగముకంటె దనికిఁ బ్రాయశ్చిత్త మేమి
యుండును? దాని కనుజ్ఞ యిమ్ము" అని యనుతాపముతోఁ
గోర నా దయాశాలి " యంతగా విచారింపకుము. ప్రాణ
త్యాగ మక్కఱలేదు. ప్రాయశ్చిత్తకర్మము లక్కఱలేదు.
హృదయపూర్వకముగా చేసిన పనికిఁ జింతించి మరల నట్టి
పని చేయకున్నఁ జాలును. నీవు చేసిన ప్రతిజ్ఞ నిలఁబెట్టుకొ
ననఁ జాలును. అట్లయినచో నిప్పంటుకొనిన తూలరాశివలె
మహాపాతకరాశి యంతయు నిమిషములో దగ్ధమయిపోవును"
అన నతఁడు " కేవలము పశ్చాత్తాప పడుటయే కాదు. అమ
రేంద్రుని యొద్ద నున్న యమృత కలశము దెచ్చి యీయస్థిరా
సులపైఁ జల్లి వారల నందఱను మరల బ్రతికించెదను"
అన నాకరుణాసాగరుఁ డానంద సాగరమున మునిఁగి " యట్లు
గావింపు" మన నతఁ డఱక్షణములో నమృతము దెచ్చి మృతు
లగువారలనందఱను బ్రతికించి నాగులకానందముగలిగించెను.
దేవతలందఱును వచ్చిచూచి గరుత్మంతునిమనసు మార్చినమ
హానుభావుఁడు జీమూతవాహనుఁ డని తెలిసికొని సంతసించి
"దయామయా! యొకవరము కోరుకొను" మనన నతఁడు "లో
కులందఱును సుఖవంతులు గావలయు" ననికోర వా రట్లనిరి

" లోకా స్సమస్తా స్సుఖినో భవంతు "

